శ్రీ హనుమంతరాయ గ్రంథమాల.

ద్వితీయ కుసుమము.

# జేబున్నిసా



చరిత్రాత్మకమగు అయిదంకముల నాటకము.



గ్రంథకర్త

పింగళి నాగేంద్రరావు.

( కృష్ణాపత్రికనుండి పునర్ముద్రితము )

1923

# ఉపోద్ఘాతము

నేనీనాటకమందలి ప్రీతిచేతను, అనురాగముచేతను, కృష్ణాపత్రికలో వచ్చు భాగములను సేకరించుకొని దాచుచుంటిని. ఇట్లుండగ నే యీనాటకము అచ్చుపడుచున్నదనియు త్వరలో వెలువడుననియు ప్రకటింపబడినది. మేవాడు రాజ్యపతనమువలె నియ్యది పుస్తకరూపమున వెలువడదను నుద్దేశ్యమున అట్లు చేయబడినది. నాటకకళ కిప్పుడిప్పు డుత్కృష్టస్థితి సంభవించుచున్నదని సంత సించుచున్నాడను. ఈనాటకమందలి రసపోషణ బహురమ్యముగా కుదుర్చబడి యున్నది. అందలి యుక్తిబాహుళ్యమును, సుగమకథాసందర్భశుద్ధియు, మ్జు లపదపుంజరంజితరచనాచమత్కృతియు, విశేషించి భావప్రకటనమునకు తగి యుండుఘట్టములును గలిగి సమయసందర్భసముచితరసభూయిష్ఠంబై యలరా రుచున్నయది. ఎంతటి మతియుతులైనను మనవారు నూతనవిషయంబు విష ప్రాయంబుగ నెంతురు. ఈ ఉన్నిసా ప్రేమించినది శ్రీశివాజీమహారాజుయొక్క భౌతికశరీరమును గాదు. హిందూధర్మమునకు దనసర్వస్వమును ధారవోసిన వీరుని— మతస్వాతంత్ర్యమునకై పతాకధరుడైన దేశభక్తాగ్రేసరుని యందలి వ్యక్తిని ప్రేమించినది. ఇట్టి నాటకములు హిందూమహమ్మదీయైకమత్యమునకే బీజములగునుగాని వేరుగ బరిణమించవు. ఇందు వీరుచూపిన భావచమత్కృతియు నిట్టి చరిత్రకథలలో వీరు వెలయించిన రససామగ్రియు వీరికళానైపుణ్యమును బ్రకటింపుచున్నవి. ఇట్టి వారు నూతనచరిత్ర భాగముల పరిశోధించి

నటులకు భావప్రకటనమున కనుకూలముగ నుండు నూతనరూపకములు వ్రాసి నాటకశకింకను విఖ్యాతికలిగింతురని నమ్ముచున్నాడను. ఈనాగేంద్రకవిని పరాత్పరు డాయురారోగ్యైశ్వర్యాన్వితునిం జేయుగాక యని దీవించుచున్నాడను.

బుచ్చిరెడ్డిపాలెం,
1—౯—1923

ఇట్లు,
నెల్లూరు నాగరాజరావు.



# వక్తవ్యము

శ్రీయుత మణిలాల్ గంగోపాధ్యాయుని వ్రాతల సాధారము చేసికొని "సరస్వతీనికేతనము, (మచిలీపట్టణము) వారు రచించి ప్రకటించిన విదుషీమణులు అనుపుస్తకమున నీకథకలదు. ఆకథా పరిచయ మీక్రిందివిధము.

ఔరంగజేబునకు జేబున్నిసాయను నొక కొమార్తెగలదు. ఆమె కవయిత్రి. రాజకీయములందును విశేష ప్రజ్ఞావంతురాలు, శాంతశీల, ఉర్దూభాషలో ఆమెరచించిన అనేకభావగీతములు కలవు. ధర్మనిర్వాహణమనిన ఈమెకుప్రాణము.

హిందూమతమునకు అన్యులవలని విఘాతము కల్గుచున్నప్పుడు తద్ధర్మరక్షణార్థమై ఖడ్గధరుడైన శివాజిని ఈకన్యామణి అభిమానించినది. అంతర్యమున మోహించినది. కాని తనప్రేమను బహిరంగపరుపలేదు. తన కామసంతృప్తికై స్వమత ధర్మములను ధిక్కరింపలేదు. శివాజిఢిల్లిలో ఖైదీయైనప్పుడు "ఒకధర్మోద్ధారకుడు ప్రపంచమునకు కాకుండ పోవుచుండెనే" అనిపరితపించి అతనిని ఉపాయమున చెఱనుండి విడిపించినది.

తాను శాశ్వతబ్రహ్మచారిణియై ధర్మారాధనమును సల్పినది. ధర్మమూర్తిని పాలించి తరించినది."

ఈ విషయముననే కథాపోషణకై వలయు స్వల్పపరికల్పనముల నీరూపకము వేగ రచించితిని. ఇందలి రోషనారాదిపాత్రలు నాటకప్రయోజనము నర్థించి స్వతంత్రముగ వచ్చికొనినవి. ప్రయోజన విశేషములు విపులముగ చర్చించుటకిచట నవకాశముచాలదు.

ఈజేబున్నిసా కథనువిని దీనినిరూపకముగ నటులకు అభినయానుకూలముగ నుండునటుల రచింపవలసినదిగా సుప్రసిద్ధనటకులగు డి. వి. సుబ్బారావుగారు నన్నొకమారు కోరియుండిరి. వారి ప్రోత్సాహముచేత నీనాటకమును రచించితిని. రంగవిభజనాదికములు వీరు నాకుచాలగ తోడ్పడియుండిరి. అందులకువారికి కృతజ్ఞుడను.

ఈ నాటకమును శ్రద్ధతో పరిశీలించి, ఆంధ్రసారస్వతలక్ష్మికి నూతన విభాగమును కల్గ జేయుచున్న తమ కృష్ణాపత్రికా రాజమున సంపూర్ణముగ ప్రకటించి, నాకు ప్రోత్సాహమును కల్గ జేసిన తత్పత్రికాధిపతులకును, శ్రద్ధతో నీనాటకమును వీక్షించి ఉపోద్ఘాతము వ్రాసి యిచ్చిన శ్రీయుతులు సెల్లూరు నాగరాజరావుగారికిని విశేష కృతజ్ఞతను దెల్పుచున్నాను.

వస్తుకల్పనా సమయమున నాకు సలహా నొసంగియు, తగుప్రోత్సాహము నొసర్చియు, గ్రంథ ముద్రణమునకై వలయు సహాయమొనర్చియు నాకుతోడ్పడిన శ్రీయుతులు వేమూరి దుర్గానాగేశ్వరరావు బి. ఏ. యమ్, బి. అండ్ సి. యం; గారికి నాకృతజ్ఞతను దెల్పుచున్నాను.

“కృష్ణాపత్రికలో” ప్రచురించినప్పుడే ఏవారమునకు ఆవారమే పుస్తకమునకు యోగ్యముగ కూర్పించి ముద్రించుటచే ముద్రణదోషములు విశేషముగ కేకలవు. పాఠకులంతు మించి తదితర దోషములదెల్పిన వినయపూర్వకముగ స్వీకరించి ద్వితీయముద్రణమున సవరించుకొనగలవాడను.

ఇట్లు

పింగళి నాగేంద్రరావు.

కీర్తిశేషులైన



శ్రీ వేమూరి శ్రీనివాస వేంకటాబ్బారావుగారు.

## కృతి

ఆంధ్రవిద్యార్థులకు

శ్రేయోభిలాషులై విశేషోపకార మొనర్చి

గార్హస్థ్యధర్మమును క్రమముగా

నిర్వహించి

స్వర్గీయులయిన

శ్రీ వేమూరి వెంకట సుబ్బారావు పంతులుగారికి

సమర్పితము.

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు

పురుషులు.

శ్రీశివాజీ—కథానాయకుడు.

సమర్థరామదాసు—శివాజీ గురువు.

సదానందుడు } రామదాసస్వామి శిష్యులు.
శక్తిపాదుడు }

మోరోపంత్—శివాజీ ప్రధానమంత్రి.

నేతాజీ }
తానాజీ } శివాజీ మంత్రులు.
ఆబాజీ } దండనాథులు.
అన్నాజీ }

శంభాజీ—శివాజీ కుమారుడు

రామసింగ్—ఢిల్లీపాదుషా కొల్వులో నొకసర్దారుడు.

ఔరంగజేబు—ఢిల్లీ పాదుషా

షైస్థఖాన్ } పాదుషా ప్రధాన దండనాయకులు
దిలేర్ ఖాన్ }

(కాశీం మొదలగు భటులు కొందఱు సమయానుకూలముగ వత్తురు.)

స్త్రీలు

జేబున్నిసా—ఔరంగజేబు కుమార్తె కథానాయిక

రోషనార—ఔరంగజేబు చెల్లెలు

చెలికత్తెలు, దాసీలు మొదలగువారు సమయానుకూలముగ వత్తురు.



శ్రీరస్తు.

# నాంది

---

శా॥ రోచిః కోమల పూరసంకలితమై రోదోంతరాళంబు ప్రా
చీ చంద్రాతపవీచులందున ప్రదీచీశాంత. మార్తాండ రే
ఖా చక్రంబులలీనమై శ్రుతిసుధాగానంబు గావింత్రు ప్ర
జ్ఞా చక్షుస్సులు పోల్చిచూచికొని సంధ్యారాగ సౌహార్దముల్

(నాంద్యంతమున సూత్రధారుడు.)

చ॥ మునుదశకంధరాద్యసుర మూలమధర్మము రాఘవాది స
జ్జన చరితామృతంబునన క్షాళితమైనది నేటిభారత తా
వని చెడి పూర్వ భారతనృపాలక పూతచరిత్రవర్ణనం
బున శ్రవణంబునన్ దొలగుచుండు సనాతన ధర్మరక్షకై ॥

(పుష్పాంజలి చల్లి)

స్వాతంత్ర్య జిజ్ఞాసితులరగు పూతాత్ములు సభాసదులు మీ రాజ్ఞాపించినట్లు నేటి రాత్రి జాగరణమునకై పరిణయతత్వమును స్మరించు స్వధర్మరక్షాభిమానపూరితమగు నాటకమాడు టకు ప్రయత్నములు చేసితిని. (చూచి) ఏమిది! అయ్యో! నాటకము పేరేమనియా? "[illegible]." [illegible] స్వధర్మ[illegible]

కాటి:- స్వామీ! అదికాదు. ధర్మసామంజస్యమును ప్రశ్నించునప్పుడు సోదరునకు శివాజీయేమి కాడా? రాజూ మిణకూడదా!

సూత్రి:- ఓయీ! శివాజీ సామాన్యమనుష్యుడు కాడు. రామచంద్రునియందలి సద్గుణము లన్నియూ శివాజీయందునుగలవు. పరకాంతావిముఖత్వమున రాముడెట్లో శివాజీ అట్లే. రావణుని రాజ్యమంతయు నప్పగిమ్మాయవచ్చిన శూర్పణఖను రాముడెట్లో మొగలు సామ్రాజ్యాధికారమును గుప్పిడిలోపెట్టుకొన్న రోషనార నితడట్లే తృణీకరించినాడు. రామచంద్రునివోలె శివాజీయు సామ్నాయములకు గోపాయిత ఇంకమెలగును. శివాజీ కలిలో కృత యుగధర్మమును నడిపినాడు.

కాటి:- మేఘనాదుడు శివాజీ బందిపోటుదొంగ యనినాడు.

సూత్రి:- అమాయకుడా! స్వప్రయోజనము నర్థించి పరమార్థ రహితముగ, శివాజిని "కొండ యెలుక" అనదగు నౌరంగజేబును "విగ్రహ భంజకుడు" డనదగు నట్టిన పాశ్చాత్యుల వ్రాత లాధారముగ బలికిన పలుకులా నీవు విశ్వసించెదవు? శివాజీ మహమ్మదీయ స్త్రీల నురక్షించెను. మహమ్మదీయుల కొఱకు మసీదుల గట్టించియిచ్చెను. భారతవర్షమును సర్వమత సంధాయినిగ జేయుచు వాని నారాధించెను. ఔరంగజేబు తన శాసనము క్రిందనున్న హిందువులను వారి మతమును, దేవాలయములను, అజ్ఞులగు సేనాపతుల పీడనమునుండి రక్షించెను. అన్యమతా సహిష్ణుత కూడదని తన రాజ్యమున శాసన మొనర్చెను. ఇట్టి మహాత్ములనా నీవు సంశయించినది.

కాటి:- క్షమింపుడు. _ అజ్ఞుడను.

సూత్రి:- క్షమాపణ మేటికి? కాటిల్యా! సామ్రాట్. శేషమును త్వరలో ముగింపుము.

కాటి:- (నిష్క్రమించును)

సూత్రి:- అహా! ప్రకృతి విచిత్రమైనది. "కృపాణము యొక్క నిశితధారనుండి కృపారసమును ప్రవహింప జేయును. శ్రీకృష్ణుని నిత్యరూపము మురారి కాదు. తన వంశీగాన మాధుర్యముచే జీవులను ప్రేమరసాంబుధి యందోలలాడించిన మురళీధరుడు" — ఒకప్పుడు హిందూ మహమ్మదీయ సంఘట్టనమున సార్వభౌమత్వము తల్లడిల్లి పోయినది. భయధ్వానములచే దేశము ప్రతిధ్వనితమై పోయినది. రాజ్యములు తారుమారు కావచ్చునుగాక సభ్యతలు మాత్రము నాశనము కాజాలవు గదా! ఈ రెండు మతములను భారతభూమి

యందు సమావేశమైనవి. కాని అల్పబుద్ధిచే నుభయులు నీచంగముగను విపరీతముగను విరోధమునే పెంచుకొనిరి. వైరమును సాధించిరి. కాని ఇట్టి విషమావస్థలో ప్రశాంతమయియగు ప్రకృతి తన ప్రేమసందేశమును జెప్పినట్లు చేతులిచ్చి భాతృత్వంగమునకు బంపెను. ఆ శాంతిదూతయొక్క ప్రేమశీలముచేతనే నాడు అఘోర దుఃఖోపభోగదేశము శాంతి పునీతమై తరించినది. ఈ పుణ్యక్షేత్రవణమున సకల పాపవ్యథా చితులును స్వస్థమనస్కులై శాంతిసుధనుపభోగింప గల్గుదురు కదా! ఆహా! ఓయి నిర్వాణసుఖాన్వేషణులార! మార్గదర్శిని అదిగో కృష్ణవేణీ సాహితీ సాంస్కృతరంగాధ్వముల సంవిత్ ప్రవృత్తులు నృత్యమాడుచున్నవి:

గీ॥ ఇవియ ముక్తి కాంతామణి యాడులాడి
పట్టి దివిషన్నదీ తరంగాంబు కణము
లనఘ మీ చోట మీ జుట్టు కొనలు తడిపి
ఇదిగో ముక్తి సౌధపు మెట్ల నెక్కి రండు.

(నిష్క్రమించును)

ఇది

ప్రస్తావన

---

గీ॥ అదియు నిదియననేల? మాయాత్మ ధర్మ
ఖడ్గలోహాగ్నిఁబడి సర్వకలుషములును
భస్మమయ్యెనిందు నిచట సంభవుఁడనై యి
సీ! దురాపాఘములనే సహింపగలనె ॥

గోమాత కొఱకై, స్వధర్మము కొఱకై ఖడ్గమును బట్టిన నేను ధర్మహానిని సహింతునా? ధర్మచ్యుతుఁడను కానా? ధర్మ ధిక్కారమైన కోర్కెనీడి నాకొఱకై నరకద్వారములు తెఱువఁబడవా? నా స్వభావమును దెలియక యొక మహమ్మదీయ కులాంగనను చెఱవట్టి నాకు కానుకగా తీసికొని వచ్చిగా అబాజీ— ఎంత మతిమాలినవాఁడయ్యెను. నాకుఁ దీరని కళంకముం దెచ్చిపెట్టెను. తానొనరించినపని నాహృదయమునఁ జిచ్చిడుచున్నదని యాతఁ డెఱుంగక పోయెను. తన ప్రజ్ఞకై యీశివాజీ మెచ్చునని యాతఁ డనుకొనెను గాబోలు! ఛీ! రాజగుటకన్న పాపము గలదా? ఎందఱి యత్యాచారముల కీతఁడు బాధ్యత వహింపవలయును?- నేనిట్లు సేయ వాతని కాజ్ఞాపించితినా? నాయాశయములకు విరుద్ధముగా నాతఁడిట్లేల యొనర్పవలయును. అతని నేనేమని మందలింతును. ఈశ్వరా! ఏమి యీసంఘటనము—

(ఒక మహమ్మదీయ యువతితో నాబాజీ ప్రవేశము.)

అబాజీ:- జయము. మహారాజా!

శివాజీ:- (ఊరకుండును)

అబా:- మహారాజా—

శివా:- అబాజీ! చాలు. తెలిసినది ప్రతాపము.

అబా:- స్వామీ! నాయపరాధ మేమి?

శివా:- అపరాధమా?— ఈ స్త్రీ యెవరు?

అబాజీ:- కళ్యాణ దుర్గాధీశ్వరుఁడగు మూలనహమ్మదు కోడలు. అద్వితీయ సౌందర్యవతి. యుద్ధవిజయ చిహ్నముగ తమ చరణసన్నిధి సమర్పింపఁదెచ్చియుంటిని ఈరత్నము—

శివా:- హతోస్మి హతోస్మి. ఏమి నా దురదృష్టము--

అబా:- దేవా! ఈ నా పొరబాటు—

శివా:- పొరబాటు. ఏమి పొరబాటు. స్త్రీలను చెఱ బట్టుట తగునా—

అబా:- ఏమి దేవా! తురకలు మన హిందూస్త్రీల నిట్లు సేయుటలేదో! ఇంతకన్న ఘోరము లొనర్చిరేవారు.

శివా:- ఏమిమాటలివి అబాజీ! ఎవడో యొక తురుష్కుఁడట్లు గావించెనని యాజాతి నంతటి నట్లే తలంతువా? పవిత్రమగు హిందూధర్మమునకుఁ జెందిన నీవీ యమానుషమున కొడిగట్టలేదా? వారల నధిక్షేపించుచు నీవొనర్చిన ఘనకార్యమేమి?

అబా:- స్వామీ—

శివా:- వలదు. వలదు. ఎట్టి క్షమాపణముఁ గోరవలదు. నీవెట్టికి క్షమాపణముఁ గోరవలయును. కోరవలసినది మేము. (మహమ్మదీయ స్త్రీ దిక్కై) తల్లీ! నా సేవకుని యజ్ఞానమును క్షమింపుము. నీవు నీకుమారుని యింటికి వచ్చితి వనుకొనుము. తల్లి కుమారుని దీవించుటకు రాదా! జననీ! నీ సౌందర్యమే నాతల్లికున్న యెడల నేనెంతటి యదృష్టవంతుఁడ నయ్యెడివాడనో. తల్లీ! నీరాజ్యమునకు నీవు సురక్షితముగఁ జేరఁగలవు. ఈ నీ కుమారుని క్షమింపుము.

మహ. స్త్రీ:- భాయీ! ధన్యహో (సోదరా! ధన్యుఁడవు గమ్ము)

శివా:- అబాజీ! నీ వీమెను తిరిగి స్వస్థానమునఁ జేర్చిరమ్ము. పొమ్ము. అంతదనుక నేను నీ మొగము జూడను.

(అబాజీ తురుష్క స్త్రీతో ప్రస్థానము)

శివా:- అజ్ఞానులగు ననుచరులతో రాజ్యము నిర్వహించుట దుస్తరము. రాజును రాజానుచరులును ధర్మభీతిఁగలిగి న్యాయబద్ధులై మెలఁగునపుడే రాజ్యపరిపాలన సరిగ నిర్వర్తింపఁబడఁగలదు లేనిచో నెన్నటికిని రాజు బాధ్యత వహింపఁగలఁడు?—రాజు నిరహంకారుఁడై సర్వవిధములైన బాధ్యతలను భగవానునియందు యుంచి కర్తవ్యమును పాలింపఁజాలినఁగాని యాతని కల్లర మెక్కింప సాధ్యమా?

ఉ॥ రాజయి రాజ్యశాసన పరాయణుఁడై చరియించుచుండి యెం |
తో జనపోషణాభి రతినున్నను నెంతటి పాపరాశి ని |
ర్వ్యాజతవచ్చి వాని తలపైఁబడు నెంతయు దుర్భరంబు తం |
డ్రీ! జగదీశ! రాజ్యము భరింపఁగ లేననుభీతి గల్గెడున్ ॥

(ప్రస్థానము)



రంగము—2.

స్థానము. నర్మదా నదీతీరము.

సమయము — ప్రాతఃకాలము.

సదానందుడు భక్తిపరవశుడై ప్రవేశము.

సదా:-

మ॥ జలకంబాడిననాడఁగావలెన్ను కృష్ణస్నాన పుణ్యోదకం
బులనంచున్ రహిఁదీర్థ సేవకులుగుంపుల్ గాఁగఁబోఁగంటేఁ దో
జ్జ్వలముంగోరిలుచు హర్ష బిందువులు రాల్చన్ గంటి శ్రీకృష్ణమో
జ్జలకల్ పుట్టెను నర్మదాజలకణంబుంగాకఁ బోతింగటా!

మ॥ అరయన్ బింభమునో సుధామురళినో హారస్తోత్ర లీలయంబునో
కరపుష్పంబునో కర్ణకుండలినో కాకన్ దుచ్ఛదౌర్భాగ్యపున్
నరుడై పుట్టితినేల? ద్వారకను నీనాడైన జన్మింపకన్
గరుణాశూన్య యుగంబునంబడితిఁ గృష్ణా! యెట్లు రక్షించెదో! ॥

మ॥ అల నాద్వారకలో మహావనములో నజ్ఞాకరప్రాంతశ్రీ
తలబాలామ్రమహీజ రాజములపొంతన్ దివ్యమందారపా
ర్శ్వలసచ్ఛందశిలావితర్దికలఁ దేజంబొప్పనీమూర్తిన
ఖులఁగన్ భాగ్యము లేకఁబోయెగదహాగోపాలచూడామణీ!

ఉ॥ బృందవనాంతభాగముల వేణువునెమ్మోయి నూదికొంచు గో
బృందము వెంట నందముల బేరములాడుచుఁ బోవుచున్న నీ
చందమెఱుంగఁగోరియె యుజ్జ్వసనవీయువవీయు భావనా
స్పందనమందె డెందమొకసారి కనంబడరాదె మోహనా!

చ॥ జిలిబిలిపాట తేనియలఁ జిల్కుచు ముద్దులఁ గుప్పరింప ను
జ్జ్వల మురళీవినోదమున శాద్వల భూములయందు నాలమం
దలనడుమన్ విహారకలనన్ జెలువొందెడు నట్టి లోకమం
గళమగు నీశుభాకృతిని గాంచుట యెన్నడు మోహనా!

(శక్తిపాదుఁడను మఠీయుని శిష్యుఁడు ప్రవేశము.)

శక్తి:- "హరే మురారే మధుకైటభారే గోపాల గోవింద ముకుంద శౌరే"

సదా:- శక్తిపాదా! యుగయుగాంతరముల నుండి ఈ భారతవర్షము కృష్ణగానముచే పునీతమగుచున్నది గదా! అహా! వంశధారీ! ఓమురళీధరా!

ఉ॥ ఓమురళీధరా! సుకళ లోఁదెలుగాఁబడియున్న కౌముదీ
యామినులందు బృందవనియందు స్రవించెడు నీదు వేణుగా
నామృత వీచికాధ్వములయందున నేనొక బాటసారినై
యామము లోలిమైఁగడపునట్టి యదృష్టము నాకుఁగల్గునే॥

శక్తి:- సదానందా! గురుదేవుఁడగు రామదాసస్వామివారి యుపదేశమున గదా మనమీకృష్ణ తేజము నుపభోగింపఁ గల్గుచుంటిమి "నమో గురుభ్యః"

సదా:- "నమో గురుభ్యః" శక్తిపాదా! గురుదేవుండెంతయు శిష్యవత్సలుఁడు కదా!

శక్తి:- మిత్రమా! "ప్రేమించుట కొఱకే వారుజీవించుచుండిరి. వారు నాకుపదేశించిన మంత్ర మేమో యెఱుఁగుదువా!"

సదా:- ఏమి?

శక్తి:- "ప్రేమించుట కొఱకై జీవింపుము" ఇదియే వారి యుపదేశము. ఈమంత్రమునే పూర్వము గానరూపమున కృష్ణుఁడు భారతవర్షమున కుపదేశించియుండెను. ఈమహామంత్ర చింతనమునకు మానవహృదయముల యోగ్యములుగ సిద్ధమొనర్చుకొనఁ బంపిన దేవసందేశమే గోపికోరని వంశీనాదము నటూ యని గురుదేవులానతిచ్చి యున్నారు.

సదా:- అట్టియోగ్యతను సంపాదించుట యెట్లు?

శక్తి:- ధర్మమును పాలించుటచేత.

సదా:- ఏధర్మమును?

శక్తి:- స్వధర్మమును.

సదా:- శక్తిపాదా! అట్లయినచో నేఁడు మనఆర్యధర్మమునకు విఘాతము కల్గుచున్నది కదా? మనకర్తవ్యమేమి?

శక్తి:- స్వధర్మ నిర్వహణము.

సదా:- శక్తిపాదా! ప్రబలశత్రువులగు విధర్ములు ఉద్ధతులై యవనులు— కృత్రిమమున మన ధర్మదుర్గమును భగ్నమొనర్చుచున్నప్పుడు దానిని నివారించుట మనకోటి సాధులచేత నేమగును?

శక్తి:- ప్రబోధమొనర్చి రాజులచేత సాధన చేయింపవలెను. ప్రజారక్షణము రాజులకుఁ గర్తవ్యము.

సదా:- భారతవర్షమున నేఁడు రాజులు గతించిరి. కానిచో నీవిధముగ మ్లేచ్ఛ విజృంభణమున కవకాశముండునో?

శక్తి:- కాదు. సదానందా! కాదు. భారతదేశము గొడ్డువోలేదు. భారతధర్మము నుద్ధరించు యోధమణి యిప్పు డవతరించియున్నాడు. గురుదేవులే యొకమారి ట్లానతిచ్చి యున్నారు.

సదా:- ఎవరా యోధమణి?

శక్తి:- అతఁడు మనగురుదేవుని శిష్య కోటిలోనివాఁడే. ఎఱుఁగవా? ఛత్రపతి శివాజీ మహారాజును?

సదా:- అతఁడంతటి వాఁడా? రాజ్య కాంక్షచే నాతఁడు మొగలులపైఁ గత్తికట్టె ననుకొనుచుంటిని

శక్తి:- పొరబాటు. అతఁడు మన గురుదేవునకు శిష్యుఁడెట్లాయెనో యాయుదంత మెఱింగెదవేని నీకా రహస్యము తెలియఁగలదు.

సదా:- ఎట్లు శిష్యుఁడయ్యెను?

శక్తి:- అది యెఱుంగుటకు ముందు మనగురుదేవుని సత్య రూపము ను గ్రహింప వలయును.

సదా:- అతని సత్యరూపము "ఆర్యధర్మమే". గురుదేవుఁడు ధర్మ బోధామృతమును లోకమున వర్షించుట యెవఁ డెఱుఁగనిది?

శక్తి:- గురుదేవుని ధర్మ బోధ యెంతటితీవ్రమైనదో యెఱుఁగుదువుగదా! యావద్భారతవర్షమును పాదచారులై వారు సంచారమొనర్చి "స్వధర్మము నుద్ధరించుకొనుఁడు" అని లోకుల నుద్బోధించియున్నారు. వారిదీక్ష- విశ్వాసబలము చూడుము ఎంతటి దృఢములో! అరణ్యములం బోవువేళ సహితము "స్వధర్మే నిధనం శ్రేయః" "ఉద్ధరేదాత్మ నాత్మానం" "ఉత్తమంధర్మ సాధనం" అని యనేక విధ మహా మంత్రవాక్యముల ప్రతిధ్వనులను ప్రతిపత్రము నను వ్రాసికొనుచు బోయెడి వారు. గురుదేవునియం దీప్రబోధ దీక్షయెట్లు విశుద్ధము సంపూర్ణము నైనదో అట్లే శివాజీ యందును స్వధర్మాన్వేషణ దీక్ష విశుద్ధము సంపూర్ణము నైనది. అనిర్జనారణ్యముల పాషాండ్రతరుశాఖల గురుదేవునిచేఁ జెక్కఁబడిన యామంత్రముల జదువుకొనుచుఁ దన్మంత్రాధిపతిని గనుగొను దృఢనిశ్చయముతో శివాజీయరణ్యముల నెల్లఁ గ్రుమ్మరి యెంతయో కాలమునకు విశ్వాసబలముచే మఃగురుదేవుని గనుఁగొనఁ గలిగినాడు. సదానందా! గురుదేవుని ప్రసన్నుని జేసికొనిన యాశివాజియే ధర్మమును సాధింపఁగలఁడు.

సదా:- ఇదియా! రహస్యము? గురుదేవుఁడే ఆర్యధర్మము! శివాజియే ధర్మసాధకుఁడు. ధర్మ ప్రతినిధి! అతని యుద్యమము ధర్మారాధనము! ఆహా! గురుదేవుని మహిమ! "నమోగురుభ్యః".

శక్తి:- "నమోగురుభ్యః" సదానందా! గురుదేవుఁడు శివాజీ మహారాజువారికి దర్శన మొసంగ నేఁడు పునహా నగరమునకు నేగుచున్నవారు! మనమును వారి ననుసరించి యా ధర్మారాధకుని దర్శించి ధన్యుల మగుదుముగాక.

సదా:- శుభోదంతము, శక్తిపాద! నేటి యుదయము ప్రాజ్యము. అశ్రమమున కేగుదము.

ఇద్దరు:- "హరేమురారే మధుకైటభారే
గోపాలగోవింద ముకుందశౌరే॥ (అనిపాడుచు నిష్క్రమింతురు.)

## రంగము—3.

స్థానము — శివాజీవాగృహము.

సమయము. ప్రభాతము.

( శివాజీయు, సమర్థరామదాస స్వామియు మాట్లాడుచుందురు.)

రామ:- అవును కుమారా! రాజు, సింహాసనము నలంకరించినను, యజమానుడు, యథార్థముగా ప్రభువునైన పరమేశ్వరుని సేవకుఁడుగా తననుదలంచు కొనవలయును. అట్లు సేయునేని రాజ్యమా తనకి భారంబుగా దోచదు. శ్రీకృష్ణ భగవాను డర్జునునకు బోధించియుండలేదా? "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ! అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అని. అర్జునుండీ మంత్రిపత్యమును గ్రహించియే "త్వయా హృషీకేశ హృదిస్థితేన యథా నియుక్తోస్మి తథా కరోమి" అని స్థిర ప్రజ్ఞుఁడై తిరిగి ధనుర్ధారణ మొనర్పఁగలైను. కావున "నేను" "నేను చేయుచుంటిని" యను నహంకారమును వీడి "సర్వము నాశ్రీని దివ్యకేళామయ" మంచు నాజగత్పతి చరణసన్నిధి నాత్మసమర్పణంబొనర్చి యతని ప్రతినిధిగా తన్నెంచికొని యేపనిఁగాని చేయుచుండవలయును. అట్లైన నతనికే దోషములుకాని సంక్రమింపనేరవు.

శివాజీ:- గురువరా! యింక నీరాజ్యాధికారమున కర్థమేమి?

రామ:- కుమారా! రాజ్యాధికారము స్వేచ్ఛావాంఛలఁ దీర్చికొనుటకుఁగాదు. ప్రపంచ డంబాచారములను గడుపుటకును గాదు. అయ్యది రాజునకు విధ్యుక్తమైన ధర్మము; స్వయంనియంతృతమైన కఠినమైన యుద్యోగము గా నుండవలయును. అపుడు రాజ్యాధికారము సార్థకమగును. రాజుతాను చేసెడి ప్రతికార్యమునందును, బాధ్యతనెఱిఁగి ప్రవర్తింపవలయును. ప్రజలకు దానుత్తరవాదినని గ్రహింపవలయును. వారిబాగే తనబాగు వారి రోగే తనరోగునని యెఱుఁగవలయును. చూడుము.

,,గీ॥ ధరణిధేనువుఁ బిదుకంగఁ దలఁచితేని
జనులఁ బోషింపుమధిప! వత్సములమాడ్కి—
జనులు పోషింపఁబడుచుండ జగతి కల్ప
లత తెఱంగున సకల ఫలంబు లొసఁగు॥"

శివాజీ:- గురుదేవా! ఈశివాజీని యింతవానిఁగ జేసినది తమయొక్క ధర్మోపదేశబలము. ఈమహారాష్ట్రరాజ్య ప్రతిష్ఠాపనకు సాధనసామగ్రి సమకూర్చినదియు, దమ యుపదేశబలమే! నిర్జీవభూళి పటలినుండి, యీమహారాష్ట్రజాతిని లేవఁ దీయుటకుఁ దోడ్పడినదియు తమ ప్రబోధమే. నారాజ్యము నాప్రజలు, నేను, సర్వమును తమ కరుణాప్రపోషితములే. మీయాశీర్వాద బలముననే నేనింతపనిఁ జేయఁగలిగితిని. నేను విద్యావంతుఁడను గాను. రాజనీతులలోఁడను. శిబిరములలోఁడను నాకట్టి పరిచయమును లేదు. జన

నంబాదిగ సామాన్యగ్రామములయందు పెరిగితిని. ఒక సామాన్య జాగీరుదారుని పుత్రుఁడను. కరకుని మనుమడను. అయినను నావర్తనమును పోషించుభవత్పాద భక్త్యాదృత లహరీ ప్రవాహములు నా విశాలహృదయమునఁ బ్రవహించుటచేతనే, నిజబాహు మేధాబలంబులఁ బ్రదర్శించి, ఛత్రపతినై యధికార గౌరవంబుల సంపాదించి, దాదాపు శూన్యంబునుండి రాజ్యమును సృష్టింపఁగలిగితిని. మత్రియుఁ నొకనైపున బీజపూరువారు, నొకదెస మొంగలులు, నొకప్రక్క సిద్దీనియర్లు, నీవిధంబుగా శత్రుమండల మధ్యంబున ప్రతికూలములతోఁ బెనఁగుచు, నిలుపుకొనఁగలుగుచుంటిని. నాతక్షణమును యూరోపియన్ వర్తకులాశ్రయించియుండిరి. నాస్నేహమును బీజపూరు గోలుకొండ నవాబులు సుంకములిచ్చి సంపాదించుకొనిరి. మోఅజీంషా మైత్రినపేక్షించుచున్నాడు. నావిరోధమును ఢిల్లీలో నామయూరసింహాసనాసీనులగు రాజాధిరాజులుఁ గూడ భయములోఁ జూచుచున్నారు. ప్రభూ! దీనికంతటికినిఁ గారణము తమకరుణయేకదా! మీఋణ మెట్లు తీర్చుకొనఁగలను-

సీ॥ ఏరాష్ట్ర కళ్యాణ మారంభమయ్యెతో
  రణ దుర్గ విజయ తూర్యములతోడ
నేరాష్ట్రకీర్తి ప్రచారమయ్యెను వీర
  మహారాట శౌర్య జృంభణముతోడ
నేరాష్ట్ర మహిమ ఢిల్లీశుబిమ్మిటిపోవఁ
  జేసె నబ్బురపు జేజేలతోడ
నేరాష్ట్ర శక్తి మయూరాసనము నూపె
  ప్రబల జాతీయభావంబుతోడ

గీ॥ నా మహారాష్ట్ర పూజ్య రాజ్యంబునేడు
సి శివాజి మీపద సన్నివేశమున స
మర్పణము సేయుచుండె మోదాత్ముఁడగుచు
దృఢమనంబున భోగనిర్వృతిఁదలంచి॥

(అని తలపాగఁదీసి చేతిలోఁ బెట్టుచున్నాడు.)

రాము:- కుమారా! ధన్యుడవగుదువుగాక! సర్వసంగపరిత్యాగ మొనర్చిన మాకు రాజ్యమేమిటికి? ప్రియశిష్యా! కాదని నిన్ను నొవ్వఁజేయఁజాల. రాజ్యము బరిగ్రహించితిని. నాయాజ్ఞ నాకు బ్రతినిధివై నీవీ రాజ్యము నేలుచుండుమది. ఇది మా ఆదేశము.

శివా:- మహాపురుషాదేశము శిరోధార్య మగుచున్నది. ఇందుల కధికారచిహ్నమేదైన నను గ్రహింపవేడెద.

రాము:- (తన కాషాయాంబరమును చింపి) ఈకాషాయాంబరమును మా యాదేశచిహ్నముగా గైకొనుము. దీని కెట్టియవమానమును గలుగరాదు.

శివా:- ధన్యోస్మి! ధన్యోస్మి! ఈ కాషాయాంబరశకలమే, నా జయపతాకమగుగాక. ఈ పతాకము భారతి గౌరవాధ్వంబున దాండవంబాడుగాక!

(ప్రవేశము - మోరోపంతు)

శివా:- ఎవరు మోరోపంతా? గురుదేవా! ఈతఁడు నా ప్రధానమంత్రి.

మోరో:- సాధు చంద్రమా! వందనములు (వందారును)

రామ:- వత్సా! శుభమగుగాక;

శివా:- మోరోపంత్! విశేషములేమి?

మోరో:- ఏమి విశేషములు. పురందరదుర్గము మొగలుల వశమయ్యెను.

శివా:- ఏమి? నీవేమి మాట్లాడుచుంటివి?

మోరోపంత్ —

మోరో:- పురందరకోట మొగలుల హస్తగతమయ్యెను. ఈ దుర్వార్త నేమని విన్నవింతును.

శివా:- పురందరకోటపోయినదా? 1200 మంది సైనికులతో బాజీప్రభు వచ్చుటనుండెనికదా కోట మొగలుల స్వాధీనమెట్లయ్యెను?

మోరో:- ప్రభూ! ఇందు ప్రయత్నలోపమేమియు జరుగలేదు. ఆశరరంగయోధుడు పోరి పోరి తుదకు తన సర్వనాశనము సమీపించుటఁజూచి 700 మంది వీరభటులతో దుర్గము వెడలి వచ్చి శత్రురణఘడలను పాడుజేసి దిలేర్‌ఖాన్ గుడారము సజొచ్చి 500 మొగలులనుపొడిచి చంపివేసెను. అప్పుడు దిలేర్ ఖానుడు నీ పరాక్రమమునకు మెచ్చితిని నీప్రాణమిచ్చెద నను మ ముందటికిరాఁగా, ఆ యభిమానయోధుడు "నేను శివాజీసేవకుఁడను. నీవాగ్దానములతోడను, ప్రాణదానములతోడను నాకేమిపని" అనిపలుకుచు ముందునకుబోవుచుండ 300 మొగలుభటులు ఖడ్గములచే నతనిగొట్టిరి. వాఁడీవిధముగనగుటచే దుర్గలక్ష్మి మొగలులపాలఁబడినది.

శివా: హా! దురదృష్టము. యోధమణిని గోల్పోతినే, నాదక్షిణహస్తము విరిగిపడిపోయెనే ప్రధానదుర్గమునే గోల్పోతినే! ఏమి యీవిధివిధానము! స్వాతంత్ర్యసౌధము కూలిపోవుచున్నట్లున్నదేమి? భవానీమాత నిర్ణయమేనాయిది! గోమాతకిక రక్షణమెక్కడిది!

రామ:- వత్సా! శాంతింపుము. నామంత్రోపదేశ మప్పుడేమరచితివా! ఇదియంతయు నా దేవియొక్క లీలయే. నీవు మొగలులకులోఁబడుటయు నాతల్లి నిర్దిష్టకార్యనిర్వహణ సాధనము కాకూడదా! నీ తర్కములుమాని, యీ నీ కష్టము దైవోద్దిష్టమేయని యెంచి యట్లొనర్పుము. ఇదినీకు దుఃఖకారణముకారాదు. ఇదియొక యద్భుతపరాభవము. దీనికి సమ్మతింతువేని ముందు నీకెంతయో గౌరవలాభములెన్నియోకలవు. సకలమెప్పుడును నభివృద్ధి ముఖముగనేయుండును.

శివా:- బుద్ధిపూర్వకముగా విధర్ముల యధికారమును స్వీకరించుటయా? అది యెట్లు సాధ్యము కాగలదు.

మోరో:- ప్రభూ! సాధ్యమేలకాదు? మన వంచక రాజనీతిని ప్రదర్శింపవలె! సత్యపరివర్తనమే సర్వార్థసిద్ధికి కారణము కాజాలదు. మనము యథార్థముగ నున్నను లోబడినట్లు నటింపవచ్చును. మేము స్వతంత్రులమై తమపై తిరుగబడినట్లు నటించి మొగలుకోటలను దోచుకొనుచునే యుందుము. మాత్రము యథావిధిగ సంధికి బద్ధులైయుండుడు.

శివా:- (రామదాసువైపు జూచును.)

రామ:- శివకుమారా! నీ ప్రభానుని యాలోచన సమంజసముగ నేయున్నది. మగునేని రాజనీతియుఁ బ్రయోగార్హమే యగును.

శా॥ రాజుల్ నిచ్చలు రాజ్యపాలన కళాప్రావీణ్యముంగల్గి యే
వ్యాజంబో పరరాట్పురాక్రమణ కార్యంబందుగల్పించి ని
స్తేజంబొక్కటఁ దేజమొక్కట బ్రదర్శింపన్ వలెన్ యుక్తినై
"సౌజన్యం యదికింబలేన" యను నీ శాస్త్రంబిటంజెల్లునే॥

శివా:- ఇది యుక్తివాదము. గురుదేవా! ఏసత్యోద్ధరణార్థమై యీశివాజీ ఖడ్గమును ధరించెనో ఏమి? యాతఁడే తద్ధర్మోల్లంఘన మొనర్చి సత్యమునకు శాశ్వతముగా విఘాత మొనర్చునే? అదిభావ్యమే! శత్రురాజ్యాక్రమణమైననేమి?

మ॥ పరువే సత్యమతిక్రమించుట మహా పాపంబగున్ సప్తసా
గరవేలాయతభూమియే నిజపదాక్రాంతంబుకానున్న సం
బరముంజెంది శివాజిగైకొనగ నున్నాఁదుండొకో ఛీత్కృతిన్
చరణాగ్రంబునఁద్రోసిపుచ్చెడి యశస్సంపాద నేచ్ఛారతిన్॥

మోరో:- ప్రభూ! సత్యమునందు మీకుగల యభిమానంబున నిట్లనుచుండిరిగాని తమరుమాత్ర మెఱుంగరా కర్తవ్యము? తాత్కాలికంబగు నీ సత్యధిక్కారము ను సత్యమునకే దోహదమగుటంజేసి యఘకారణము కానేరదు,

రామ:- వత్సా! ఏటికి నీకీసంశయము? 'ధనానీ భూమ్జ్ఞయే' గానుకొనుము. దైవసంకల్పమును కొనుము. నీకీ యభిమానమేటికి? ఇపుడు నీవీ యుపాయమును మన్నింపవేని నీ పురోభివృద్ధి కెట్టినిరోధము కలుగునో, నీరాజ్యమేమగునో, నిన్ను నమ్ముకొనిన నీప్రజలేమగుదురో, నీవేమగుదువో లోకకళ్యాణార్థమై బయలుదేరదీసిన నీ మహారాష్ట్రజాతి యౌద్ధ్యమేమగునో యోచించితివా! సావధానముగ నాలోచించుకొనుము. నీకే తెలియఁగలదు.

శివా:- (విచారించి) స్వామీ! రహస్యమును గ్రహించితిని. దేవర యుపదేశమును స్వీకరించితిని.

రామ:- వత్సా! జయముగాక! మా కుపూజవేళ యయినది. పోయివత్తుము.

మోరో శివా:- దేవా! దాసులు నమస్కరించుచున్నారు. (ప్రస్థానము)

## రంగము—4

స్థానము. ఢిల్లీదుర్గము జేబున్నిసాబేగం మహాలు.

సమయము. ప్రభాతము.

(జేబున్నిసా పాడుకొనుచు గూర్చుండగా ఔరంగజేబు ప్రవేశము. గానానంతరము)

ఉన్నీ:- జనకా! ఏమి యిట్లువచ్చితిరి!

ఔరం:. ఏమున్నది? ఆ కొండయెలుక—

ఉన్నీ:- ఎలుక. ఆ ఎలుకను బట్టుకొనుటకే మన తల తిరిగి వచ్చుచున్నది. అది యెలుక యనుకొనుచున్నకొలదియు దానిని బట్టుకొనుట దుస్తరమగుచున్నది. అది యొకకొండయే యనుకొనుడు. సులభసాధ్యమగునేమో.

ఔరం:- అయెలుకను కొండ యనుకొనుట యెట్లు? దానిని బట్టుకొనుటకే బోనునైనఁ బెట్టవలయును.

ఉన్నీ:- అది బోనువైపునకు రాకున్న—

ఔరం:. వచ్చినది. చిక్కుకొనునట్లు చేయుటయందే మనమిపుడు నేర్పు చూపవలయును పుత్రీ! నేటికా శివాజీ లొంగుచున్నట్లు కనఁబడుచున్నాడు. దిలేర్ ఖాన్ పురందరకోటను బట్టుకొనినాడు. శివాజీయొక్క 1200 మంది సైనికులచట హతులైరి. ఇపుడాతనికి సరియగు దుర్గమొకటి లేదు. అందుచేతనే మన స్నేహమును నతఁడపేక్షించుచుండవచ్చును.

ఉన్నీ:- అది మోసము కాదుగదా?

ఔరం:- అది మనకెట్లు తెలియును? జయసింగు, శివాజీ లోబడునట్లుండెననియు, నట్టి పక్షమున నతనికి క్షమాపణ ఫర్మానా యియ్యవలసి యుండుననియు గాన నట్టిదాని నొకటి వ్రాసి ముందుగనే తనకుఁబంపుటయవసరమనియు, నేడొక యుత్తరము వ్రాసియున్నాడు. ఏమాత్రము లోబడినను వానిని తరుణమున నధఃపాతాళమున, కణఁగఁద్రొక్కవలసినదే. ఇందుకు మంచి యుపాయ మాలోచింపవలయును.

ఉన్నీ:- జనకా! ఆ శివాజీ చాల గట్టివాఁడని తోచుచున్నది. అతని లోబరచుకొన మన మహావతకన్ని ప్రయత్నములు చేసియుండలేదు. ఏమైన లొంగెనా?

ఔరం:- ఇప్పుడేమనియెదవు?

ఉన్నీ:- సంధి షరతులలో నీమాటాతని పూర్తిగ బిగింపవలయును.

ఔరం:- ఇప్పుడు ఫర్మానా యేమని వ్రాయుట?

ఉన్నీ:- ఫర్మానా వ్రాసిన పంక్తులతో సరికాదు. మనము కొన్ని షరతుల నేర్పరచి వానికి శివాజీ యొప్పుకొనిననే కాని యే మాత్రము ననువు జూపవలదని జయసింగునకు ఖండితముగ వ్రాయవలయును.

ఔరం:- ఆ షరతులేమి?

ఉన్నీ:- శివాజీ పట్టుకొనినవి కాని కట్టించినవి కాని, యున్న కోటలు కలవు—

ఔరం:- షుమారు ముప్పది యుండవా?

ఉన్నీ:- కాదు సరిగా ముప్పదిరెండు కోటలుగలవు. వానిలో నిరువది కోటలు మనకియ్యవలెను. మిగిలిన పండ్రెండు కోటలును, దక్కిన తాను సంపాదించిన రాజ్యమును, మనకు లోబడి మన జాగీరుగా నుండవలయును. తాను మన జాగీరు దారుగానుండవలయును.

ఔరం:- మన మేమైన నాతనికి నొసంగవలదా?

ఉన్నీ:- అవును. అతని కుమారుఁడగు శంభాజీకి మనమయిదువేల గుఱ్ఱపు దళమున కాధిపత్య మిచ్చెదము. బీజపూరు సంస్థానములో షుమారైదు లక్షల మొత్తమునకు సరిపోయిన చౌతుసర్దేశ ముఖులతనికి హక్కుగా నియ్యఁబడును.

ఔరం:- ఇది చాలును.

ఉన్నీ:- కాదు. శివాజీ జయసింగుచే జరుపఁబడబోవు బీజపూరుపై యుద్ధములో తాను స్వయముగా సహాయము సేయవలయును.

ఔరం:- ఇప్పటికి షరతులు ధృవపడినట్లే కదా!

ఉన్నీ:- ధృవపడినట్లే. అక్షరశః మాత్రము జరిగితీరవలయును.

ఔరం:- జరిగించెదను. కుమారీ! ఈమూరా యెలుకతప్పక బోనులోఁ బడవలయును. నేని పుడే ఫర్మానా లిఖించి పంపెదనుగాక!

(ప్రస్థానము.)

ఉన్నీ:- ఎలుక బోనులో పడవలయును. ఎలుకయా! ఏమి యీ నిర్లక్ష్యభావము.— అబ్బ! ఈ శివాజీ చరిత్రమెంత గూఢముగా నున్నది. మొదట నితఁడొక దోపిడిగాడని యుపేక్షించితిమి. ఇపుడాతఁ డొక ప్రబలదుర్గమునకు నాథుండయ్యెను. ఒకరాజ్యమును స్థాపించెను. తాను రాజయ్యెను. బీజపూరు గోలకొండ సుల్తానులచే కప్పముల గొనుచుండెను. దక్కను నందున్నంతకాలము నాతండ్రియు నీతనితో మైత్రి నెఱపుచుండెడివాడు. పైకి "యెలుక" యని యుదాసీనముగా బలుకుచుండునే కాని యథార్థముగా శివాజీ యనిన నాతండ్రికమితభయము. మొగలుసామ్రాట్టు భారతదేశమునుండి వెడలి పోవలసివచ్చినచో నది యొక శివాజీ మూలముననే కాగలదు. మా సామ్రాజ్య నౌకకితఁడు జలాంతర్గామి యగుచున్నాడు.— ఏమి చిత్రము. ఒక్కమారు మాకు లోబడి నట్లు నటించును. మా సహాయమునఁ దన కార్యములఁ జేయించుకొనుచుండును. మఱొక ప్రక్క మా రాజ్యమును కొల్లగొట్టుచునే యుండును.— విశ్వప్రయత్నము లొనర్చినను

మేమాతని సాధింపలేకున్నాము. అతఁడేది చేపట్టినను తప్పక నెరవేరుచున్నది. ప్రతి కార్యమునందు నాతనికి జయము — దీని రహస్యమేమైయుండును? ఈతనికీ విజయము కేవలము బాహుబలమువలననే కలుగుచున్నదా? అట్లును కాదు — ఏమి — అతడు మాకన్న బలవంతుఁడా? ఇఁక తాంత్రిక బుద్ధి కుశలత యనుకొందమా? అసంభవము. నేను పన్నిన వ్యూహములనుండి చిక్కుపడకుండ నెవరు తప్పించుకొనగలరు. కాదు. ఇది యేదియునుఁ గాదు.— అతనియెడలఁగల వైమనస్యభావ మొకించుక మాని, సత్యబుద్ధితో బరిశీలించెద గాక! — అతని సేవకులెంతయు స్వామి భక్తులు. నా తండ్రి యాతని కొకమారు విషముఁ బెట్టి చంపించుటకుఁ బ్రయత్నించి యాతని సేవకుని కొకనికి, కోటి రూప్యముల నొసంగెదననిన నా స్వామి భక్తుడు మారుమాటయైనఁ బలుకక వెడలిపోయెను. శివాజీ అఫ్జుల్ ఖానుని సంహరించినప్పుడు, శివాజీని చూచుటతోడనే యాతని ప్రతినిధి శివాజీకిలొంగిపోయెను. బీజపూరు గోలుకొండరాజ్యములందలి యున్నతోద్యోగులెల్లరు, తమ పదవులకు రాజీనామానిచ్చి శివాజీని పోయి యాశ్రయించిరి. శివాజీ యొక దారి దోపిడిగాడే యైనచో నీ వైపరీత్యములకుఁ గారణమేమి? అతఁడొక మహా వ్యక్తి వలె గన్పట్టుచున్నాడు. ఒక పరిశుద్ధదేశభక్తుని వలె నున్నాడు. అతని యుద్యమము, సాధన సామగ్రి, సంకల్పశుద్ధి యన్నిటిని కేంద్రీకరించి చూచిన యాతని విజయ రహస్యము తెలియకపోదు.

(కొంచెము తల వంచి)

సీ॥ స్వార్థరాహిత్య భావాగ్నిశుద్ధినిగన్న
సత్యసంస్థాపనాసక్తి గాక
తానును, తనమహోద్యమము నీశ్వరరక్షి
తములన్న స్థైర్య ధైర్యములుగాక,
జనులనొక్కటిగ బంధన సేయఁజాలు నా
కర్షణశక్తి యోగంబుగాక,
కాలావసరములఁగను నపరూపమౌ
దివ్యదృష్టి ప్రభాదీప్తి గాక,
గీ॥ ఎట్టిదురదృష్టములును జయింపలేని
ఘనమనో నిశ్చయంబునుగాక, యతని
లోకకళ్యాణ కాంక్షయుగాక, స్వార్థ
పరత చేనిట్టి జయము సంప్రాప్తమగునె?

అతనికేమాత్రమును స్వార్థపరత్వమున్నట్లు తోచదు. తనగురువగు యొక్క సన్న్యాసికి తనరాజ్యమంతయు నర్పించెనట! ఇవుడాతని యాజ్ఞప్రకారమతని ప్రతినిధిగా రాజ్యకార్యనిర్వాహణ మొనర్చుచుండెనట! త్యాగమనిన నిట్లుండవలదా! సెబాస్! అది [illegible]నిగ్రహము. అతఁడు స్వధర్మరక్షణార్థమై బద్ధకంకణుఁ డయ్యెను- అవును. ఏజాతిధర్మము నాజాతిరక్షించుకొనవలదా! అట్టిప్రయత్నము లేనిజాతియు నొకజాతి కాజాలదు. మాకీయహంకారమేల? మేము మాముసల్మాను ధర్మప్రచారార్థమై ప్రయత్నించినట్లే శివాజీయు హిందూధర్మపాలనార్థమై కృషిసలుపుచున్నాడు. ఇంతటిబలగముగల మేమీపనిసేయుటలో నాశ్చర్యమేమియు లేదు. ఒకకోటలేదు. సైన్యములేదు. ధనముచూతమన్న నసలులేదు. తండ్రిసహాయమైనను లేదు. కేవలము శూన్యంబునుండి యింతటిమహారాజ్యమును స్థాపింపఁగలిగి ఏవిధముగా వర్తిల్లి నిర్వహింపఁగలుగుచుండెనో తలఁచికొనిన నొడలు పులకరింపకమానదు. ఆహా! ఎంతటి మహానుభావులు—

( అవనిక పడును. )



## రంగము 5.

### స్థానము—మంత్రి గృహము.

సమయము. సాయంతనము.

(ప్రవేశము మోరోపంత్)

మోరో:— (చింతాకలితుండై)

సీ॥ ఏమని చింతింతు నీనాటికి మొగల్
ఫాదుషాకును లొంగవలసివచ్చె,
నేనేమిసేతు ఫర్మానానిబంధన
లను యథావిధి నొప్పుకొనుటయెట్లు?
ఏమని యుత్తరమిత్తు నారాజు ను
ద్దేశ్యమేమో దాని దెలియకుండ?
ఏయుపాయమున నే నీ సమస్యాపరి
ష్కారము సేతు నొక్కండసగుచు
గీ॥ సేయకుండిన నీ జయసింగు సుంత
యాగలేకుండ జేసెదనన్న మా శి
వాజియేమని తా నభిప్రాయపడునో?
యేమియుందోంచ దేనిపుడేమి సేతు?

ఏమి చేయుటకును పాలుపోకయున్నది. సర్వరాజ్యవ్యవహారములను పరిష్కరించు భారము నాతలపైనిడి శివాజీ తాను నాందండయాత్రకై వెడలెను— ఇంతవఱకును రాకుండెను. పోనీ ఫర్మానానిబంధనల కొప్పుకొందమన్న నిరువది కోటల మన్యు వదలుకొనుమనుచుండెను అందు పురందరు సింహగడములు ముఖ్యములంట! ఈ రెండు కోటలుపోయిన- మారాజ్యమున కాయువుపట్టు తొలగిపోయినట్లే. దీనికి నేనెట్లొప్పుకొందును? ఒప్పుకొనకున్న, సంధిపొసంగ నేరదని ఫాదుషా ఖచితముగ వ్రాసెను. సంధికొడంబడకున్న ఫాదుషా మాపైబడక దాడివెడలును. మాస్థితిగతు లాలోచింతమన్న, పురందరుకోట మొన్ననే మొగలుల హస్తగతమయ్యెను. శత రంగయోధుడు బాజీప్రభువు 1200 మంది వీరభటులతో వీరస్వర్గముం జూరంగొనియెను. నేతాజీ తన - అశ్వదళముతో దక్షిణదిగ్విజయమునకై యేగెను. అతడింకను రాలేదు. మేము వార్తనంపి యాతనిం దిలిపింతమన్న నేతాజీ వచ్చుటకు కనీసము మూడు నెలలైన పట్టును. నావద్ద 3000 కన్న మించి సైన్యములేదు. ఇది యంతయు నాలోచింపంగా యీ పరతుల కొప్పుకొనక తప్పదని తోచుచున్నది—సరి. ఏమైనగానిమ్ము. జయసింగునకట్లనే వార్త నంపెదగాక.

(ప్రస్థానము.)



## ద్వితీయాంకము.

### రంగము 1.

స్థానము, ఢిల్లీకోటలోని ఉన్నీసా ఉద్యానము.

సమయము. సాయంతనము.

( ఉన్నీసా యొక పూఁజొంపమునొద్ద నిలుచుని యుండును. )

ఉన్నీ:- ఆతని వీరత్వమును గూర్చి చింతించిన కొలఁదియు నంతరంగ ముప్పొంగుచున్నయది. అదేమి దైవాయత్తమో యాతఁడనిన నాకసమానమైన ప్రేమ యుదయించుచున్నది. ఆతనిం గూర్చి యెట్టి నిందావాక్యము విన సహింపదుగదా నాహృదయము. నాహృదయము మా మాట వినిన దహించుకొనిపోవును — పోవును పరాభవానల తప్తమై — ఏమి వాని జితేంద్రియత్వము! తనసేనాని యొకఁడొక మహమ్మదీయ దుర్గాధీశ్వరుని కోడలిని — త్రిలోక సుందరిని — తీసుకొనివచ్చి తనకు గానుకగా సమర్పించినపుడు — ఆహా! ఆయుదార హృదయుఁడు — ఆ యంగనను తనతల్లిఁగా గౌరవించి పంపెనట! ఆమెయొక్క భువనమోహనసౌందర్యమునైనను లక్ష్యపెట్టనియాతని సత్యేచ్ఛారతి చేపనవచ్చునా. ఇంతియేనా యాతని యందలి విశేషము. — యావద్భారత వర్షమునందును ఖడ్గయుద్ధమున నీతనికి సరి మఱియొకఁడు లేఁడు- ఖండాంతరముల నుండియు నీతనియొద్ద ఖడ్గచాలనము నేర్చుకొనుటకై యనేకులు వచ్చుచుండురట! కత్తినైన సరిగ బట్టజాలని పట్టి పిరికిపందలగు మావళేలను, సుశిక్షితులఁ జేసి వారిసహాయమునఁ బ్రబలరాజ్యమును సృష్టింపఁ గలిగెను. అట్లుండవలదా ప్రజ్ఞ — ఇంతయేనాయాతని యందలి యతిశయము. ఇదియేనా నాహృదయము నింతగ నాకర్షించినది. — కాజాలదు. ఆతఁడెంతటి కరుణాళుఁడు. బిజపూరు సుల్తాను సరిగఁ బోషించుట లేదని 700 మంది మహమ్మదీయ యోధులు తన్ను శరణుజొచ్చినపుడు, ఆ దయామూర్తి — విధర్మలేయని శంకింపక, మతాంతరులేయని కంటగించుకొనక, శత్రుపక్షమువారేయని త్రోసిపుచ్చక, సాదరముగా వారికభయ హస్తమొసంగి తన పరివారములోఁ జేర్చుకొని సర్వవిధ గౌరవంబుల వారల సన్మానించెను. వారల ప్రార్థనాదుల కొఱకై తన రాజ్యమున, మసీదులఁ గట్టించి యిచ్చెనట! — అబ్బ! ఏమి! ఆ పరమతసహనము, దయాళుత్వము కేనా, నాహృదయము నింతగా నాకర్షించినది. నన్ను మోహింపఁ జేసినది! కాజాలదు. — మఱియేమి?

శా॥ ఆ రాజేంద్రునిసత్యకామనము, సౌంరా! యాదయాళుత్వ మా
ధీరోదాత్తజితేంద్రియత్వము మహాతేజంబె నన్ మార్చెనే
యారీతిన్? సరికాదనూహ్యమగునొండే భావనాతీతమౌ
నూగల్ గాంచు రహస్యమొకలదు నన్ శోధింపఁగా హేతువై!

ఏమా రహస్యము— ఆ రహస్యమేమి?— ఏమైయుండు నారహస్యము—

( ఇరువురు చెలికత్తెలు ప్రవేశింతురు. )

ప్రథమ సఖి:- సఖీ! చూడవే! చూడవే! ఇచ్చటనేయున్నది.

ద్వితీయ సఖి:- ఎచ్చటనే?

ప్ర:- కనఁబడుచుండలేదటమ్మా ఆ నెలమావిగున్న క్రింది తిన్నెపైఁ గూర్చుండి యున్నీసా యేదో యాలోచించుచున్నది.

ద్వి:- ( ఉన్నీసాను సమీపించి ) చెలీ! ఇదేమమ్మా! నీకొక్కతె యెంత వేదకితివి?—

ఉన్నీ:- ( అన్యాలోచనాధీనమానసయై యుండును. )

ద్వి:- ఇదేమమ్మా! మాఱు పలుకవు?

ప్ర:- ఊరకొనవమ్మా! ఆమె యేదో కవనము జేయుచున్నటులున్నది.

ద్వి:- నీదొక గొడవ. కవనమట! భగవంతుడు పెట్టకపోయినాడు కాని, నీకును రెండక్షరము ముక్కలబ్బి యున్నట్లయితే నీవును తిండినైన మానకొని కాగితములు పాడుచేయుచూ గూరుచుండువు.— ( ఉన్నీసాతో ) ఏమమ్మా చెలీ! కవితా ప్రపంచమునుండి యొకించుక మా ప్రపంచములోనికి వత్తువా?

ఉన్నీ:- సఖీ!—

ద్వి:- అబ్బ! వచ్చితివమ్మా మా ప్రపంచములోనికి. నీ విచ్చటనే యుంటివారేమి?

ఉ:- ( ముఖభావమును మార్చికొని ) చెలీ మీమాటలయందు నాకర్థమగుపడుటలేదు.

ద్వి:- అర్థ మెట్లగుపడును?

ఉ:- యేమే నీ జాణతనము! నీకును కవన మబ్బుచున్నదే.

ద్వి:- నీ సన్నికర్షప్రభావమున నామాత్రమైన మాకబ్బకూడదా?

ప్ర:- ఆరు నెలలు సహవాసముఁ జేసిన వారు వీరగుదురు.

ఉ:- చాలును లెండు మీపరిహాసములు. కాలయాపనమునకుఁ గాక యెందుకు వచ్చినది?

ప్ర:- చెలీ! కోపగించుకొనకుము. నీకేమైనఁ గవిత్వము గట్టితివా?

ద్వి:- నీవు త్రాడుఁ దెచ్చినకదా కట్టుటకు.

ఉన్ని:- అదిగో! మరల నీపరిహాసమును మానవైతివి.

ద్వి:- చెలీ! పోనిమ్ము ఏదీ! చదువుమేదైన పద్యమును వ్రాసియున్నచో.

ఉ:-గీ॥ ఆ బులుబులను పిట్ట గులాబిచుట్టు
జుట్టిదానితోఁ బ్రేమ మంజులవచనము
లాడుచున్నది; కాని, యయ్యాదిమదీయ
సన్నిధినె సుమ్ము ప్రేమశిక్షనుగణించె॥

ప్రి:- చెలీ! చాల బాగుగనున్న జే.

ద్వి:- అర్థము కానిదన్నియు బాగుగ నేయుండును.

ఉన్ని:- అర్థము కాకుండుట కిందేమంత క్లిష్టపదములున్నవని!

ద్వి:- క్లిష్టపదములు లేనంతమాత్రమున నన్నియు నర్థమగునా యేమి? ఏదీ తేలిక మాటలతో నే నొక పద్యముఁ జెప్పెదను. నీవర్థముఁ జెప్పుము చూతము.

ప్రి:- ఏదీ! కానీ.

ద్వి:- గీ॥ క్రింది నాకసమును దల క్రిందు సేయు
పైని భూమికి నిచ్చెన వైవగంటె?
దిగుటో, యెక్కుటో, మాయనులిట్టుటో, యె
ఱింగి సెప్పెడువారు లేరే జగాన!

రెండు రోజులు, కాదా రెండునెలలు, నదికూడ చాలనిచో రెండు వత్సరములు గడు విచ్చుచున్నాను. దీనియర్థముం జెప్పుము. చూచెదను.

ప్రి:- అందు భావమొకటి యున్నఁ గదా చెప్పుటకు?

ద్వి:- ఏమి? ఇందు భావము లేకేమి, తెలియఁజాలని వారికి లేదేమో.

ప్రి:- పోనీ నీవు చెప్పరాదూ?

ద్వి:- పోనిండు. మీపద్యములలో భావమున్నదని మీరు సంతసించుచుండిరి కదా?—చెలీ! ఇంకేమైన పద్యమును చదువుము- గ్రహింపఁ గలనేమోచూచెదను.—

ఉన్ని:- అభ్యంతర మేమి.

గీ॥ అగులోబులోని లలితోద్యత్ప్రదీప
శిఖల దేహములను విసర్జించుచుండె
నాపతంగాళి; కాని యయ్యావి మదీయ
సన్నిధినె సుమ్ము త్యాగశిక్షను గణించె॥

ద్వి:- అదిగో. అదే ధోరణి!

ప్రి: చెలీ! దాని మాటలకేమి? తన బజారు కవిత్వముకలె నుండలేదు కాబోలు! ఏదీ ఆ పద్య మా నన్నుఁ జదువనిమ్ము- (అని ఉన్నిసా చేతిలోని కాగితమునుఁ దీసికొని)

గీ॥ ఆకుపచ్చగ గోరింతయాకు.

ద్వి:- (అడ్డువచ్చి) అబ్బ నేటికి తెలిసినది! గోరింటాకు పసుపు పచ్చగనుండక నాకు పచ్చగ నుండునని.

ఉన్ని:- మధ్యలో నడ్డుపెట్టకుము. పరిహాసమునకు నొక మితమున్నది. (ప్రి:తో) చెలీ! చదువనీ జే

ప్ర:- గీ॥ ఆకు పచ్చగ గోరింతయాకు పైకి
నగపడుచు రక్తిమను లోన నణచుకొనెను
నటుల నాశాంతమూర్తి, ప్రియానురాగ
భావమును దాచుకొనెడు గుప్తమ్ముగాగ॥

భావగర్భితమయ్యును పద్యము చాల సరళముగ నడచినదే.

ద్వి:- (ఊరక చూచుచుండును.)

ప్ర:- ఏమట్లు చూచుచున్నావు?

ద్వి:- భావమును వ్యక్తముఁ జేయునది కవిత్వమగును గాని భావగర్భిత మగునది కవిత్వమగునా!

ప్ర:- మఱి యేమగును?

ద్వి:- తత్వమగును—ఇంకొక పద్య మున్నట్లున్నది. ఏదినన్నుఁ జదువనిమ్ము. (అని ప్రథమ చేతిలోని కాగితమునుఁ దీసికొని)

గీ॥ మద్వ్రాదయ దుఃఖమం దణుమాత్ర మాకె
సమున నోసఁగియుండిన కారణమున నది వి
నీలరుచిభారవహమమై నేలకొరగి
పోవుచుండె దిగంతభూములను గూర్చి ॥

ఏమిటి! ఇంత పేలవముగానా వ్రాయుట; ఎంతభావ మున్నను పదగుంభన ముండవలదా- అందులో నెపుడును గీతపద్యములనేనా వ్రాయుట!

ప్ర:- నీవో—

ద్వి:- నేనా? నేను సాధారణముగా వృత్తములనే వ్రాయుదును.

ప్ర:- ఏదీ యొకవృత్తము చదువుము.

ద్వి:- ఇదిగో మత్తేభము.

మ॥ ప్రళయాభీల సమగ్రకంపితసముద్రస్ఫుటాంతర్గతా
నల దుష్ప్రేక్ష్య సముద్భటాంచిత తరంగశ్రేణి సంరంభకృ
ద్విలసద్ద్వాదశ భానుకాంతి విభవోద్వేలా సమాలోలసం
కులవేళన్ భువనాధిభర్తవగు నీకున్ వందనం బీశ్వరా!

ప్ర:- అవును. సరిగ మత్తేభముగానేయున్నది కొంచెము తొండము పొడవన్న మాటగాని-

ద్వి:- పోనిండు. మీయున్మాదకవిత్వముకన్న మెఱుఁగే

ప్ర:- కాని, అందులో నర్థమేమైన నున్నదా?

ఉన్మ:- సఖులారా! చాలును గాని మీవాగ్వాదములు- నిన్న నేఁ జెప్పినపని సాం[illegible]

ప్రి:- అయ్యో. ఈ గందఱ గోళములోఁబడి యాసంగతి మఱచి పోతిరమ్మా!

ద్వి:- నీ విప్పుడు జ్ఞాపకము చేసేవఱ కాసంగతి నాకు స్ఫురణలో లేనేలేదు.

ఉ:- చెలులారా! ఇప్పుడైనఁబోయి ముందాపని నెరవేర్పుడు. నేను నింతలో వచ్చెదను.

ప్రి:- } అట్లనే కానిమ్మ (ప్రస్థానము)
ద్వి:- }

ఉన్ని:- ఎన్ని దినములనుండి పోయేచున్నను వారాపని నింతవఱకు నెరవేర్పనైతి. పోనీ నేనే చేయు దనన్న, నదియేమో కాని, కనులు మూతలుపడును- చేయిసాగదు- దేహ మాపాద మస్తక మును కంపించును. (ఔరంగజేబు ప్రవేశము)

ఔరం: కుమారీ!

ఉన్ని:- జనకా!

ఔరం:- ఆ యెలుక చిక్కినట్లున్నది

ఉన్ని:- (సావధానముగా) ఏమి? ఛత్రపతి శివాజీ సంధిషరతుల కొప్పుకొనియెనా?

ఔరం: ఒప్పుకొనుటయే కాదు. మొన్న బీజపూరు యుద్ధములో స్వయముగావచ్చి మన పక్షమున యుద్ధముఁ జేసెను. అతని మావళీలనేక దృఢములగు దుర్గములనెక్కి సాధించిరి. కనుక మన కతండు లోబడి నట్లేకదా;

ఉన్ని:-అట్లని మీకు పూర్ణమైన విశ్వాసము గలదా?

ఔరం:- ప్రత్యక్షముగ గన్పడుచుండ విశ్వాసమేల కలుగకుండును?

ఉన్ని:- ఈవఱ కెన్నిమారు లిట్లు ప్రత్యక్షముగాలేదు.

ఔరం:- కాని, కుమారీ! ఆశివాజీ నెట్టులైన ఢిల్లీకొకమారు రప్పింపవలెననియున్నది. అదియెట్లు సాధ్యమగును?

ఉన్ని:- రప్పింపవచ్చును.— అతఁడు మనకు జేసిన సహాయ్యము నభినందించుచు బహుమానముల నంపుచు నొక్కమారు దర్బారున కాహ్వానము సేయుఁడు. విశేష సన్మానము లొనర్చి మరల దక్కనుకుఁ బంపఁగలననికూడ వ్రాయుడు. తప్పక నాతడు రావచ్చును-

ఔరం:- అవు నట్లే యొనర్చెదముగాక! కాని కుమారీ! నేడే మట్లు దావీనముగ నుంటివి?

ఉన్ని:- ఏమియును లేదు.

ఔరం:- కొన్నిదినములనుండియు నీయందొక మార్పు గనఁబడుచున్నది.

ఉన్ని:- (ఊరకొనును)

ఔరం:- కుమారీ! ఏమైన విచారకారణమున్నచో నాకుఁ దెలుపుము. ఊరక లోలోనఁ జింతించుచు నుల్లాసమునుఁజంపుకొని మనస్సును కష్టపెట్టుకొనుట మంచిదికాదు-

ఉన్ని:- జనకా! నాకట్టి విచారమును లేదే.- నేనీమధ్య నొక నూతన ప్రబంధమును రచించు చుంటిని. దానిఁగూర్చియే నేనెప్పుడు విచారించుచుందును. దానినే మీరన్యథా తలంచిరి.

ఔరం:- ఏమి ప్రబంధము?

ఉన్ని:- ఇంకను నామకరణ మొనర్పలేదు.

ఔరం:- మంచిది ప్రబంధరచనయందైనను వృథాగా మనస్సును గలఁత పెట్టుకొనకుము. ఇంక నిక్కడ నేమి చేసెదవు.? పోదమురమ్మ. (ప్రస్థానము)

## రంగము ౭.

స్థానము:- శివాజీగృహము - రాయగడము.

సమయము. ప్రభాతము.

(మోరోపంతు, నేతాజీ, తానాజీ, నిలుచుని మాట్లాడుచుందురు)

నేతా:- మోరోపంత్! పురందరుకోటను సాధించుటకు తిరిగి ప్రయత్నములు జరుగకున్న వేమి?

మోరో:- నేతాజీ! మనపరిస్థితు లిప్పుడు కోటను సాధించుట కనుకూలముగ లేవు. మనప్రధాన దుర్గము ఔరంగజేబు చేతిలో చిక్కినది. అతనినిసాధించుటకు మనబలము చాలదు. కావున నాతనితో కృత్రిమమైత్రి నెఱపవలసివచ్చుచున్నది. ఈసంగతి వింటిరా! ఔరంగజేబు మనప్రభువు వారిని సగౌరవముగ దర్బారున కాహ్వానముసేయుచు ననేకబహుమానము లంపియున్నాడు.

తానా:- చాలపెద్ద యెత్తు వేసినాడే.

నేతా:- మనకు దాని పైయెత్తుచేతగానపుడు కదా! విచారింపవలసినది!

మోరో:- అయిన ప్రభువుగారి ఢిల్లీ ప్రయాణము విషయమై మీసలహాయేమి?

తానా:- ప్రభువువారు ఢిల్లీకిపోకుండుటయే మంచిదని నాయభిప్రాయము, ఏలనన నౌరంగజేబు బహుకుటిలుడు. మీదు మిక్కిలి బలవంతుడు. ముఖ్యముగ తనికప్పుడు స్థానబలిమియు నెక్కుడుగ నుండును. మనప్రభువు వారెంతటి బలగములోడ వెళ్లినను, నొకవేళ తప్పి వచ్చెనేని, నిర్వహించుకొనుట కష్టము.

నేతా:- పోకుండిన చక్రవర్తి విరోధము వలంచునే. అప్పుడుమాత్రము నిర్వహించుటకష్టము కాదా? ఈకష్టమెట్లును తప్పకవచ్చినట్లున్నది.

మోరో:- నేతాజీపల్కినమాట సత్యము. ప్రభువుగారు ఢిల్లీకేగుటయే యుచితమని నాకు దోచుచున్నది. ఎట్లైనను మన మప్రమత్తులమైమాత్ర ముండవలయును. కాని ప్రయాణమునకగు నేర్పాటు లెట్లుచేయవలెనో విచారింపవలసియున్నది.

తానా:- మనలో నెవరైనప్రభువుగారిని వెంబడింపవలయును.

మోరో:- తానాజీ, నీవును, నేతాజీయును ప్రభువుగారిని రహస్యముగా ననుసరింపవలెను. ఇది చాల క్లిష్టసమయము. ఏమాత్ర మేమరియున్నను నష్టమువాటిల్లును.

తానా:- ఇదియంతయు నిట్లుండ ప్రభువుగారు లేనిసమయమున నిచ్చట రాజ్యవ్యవహారముల సరిగ చూడవలసియుండును. బీజపూరువారి కీరహస్యము దెలియనీయరాదు.

మోరో:- ఆ కట్టుదిట్టములు కొన్ని యీవఱకే చేయబడినవి. మఱియు నిప్పటిలో బీజపూరువారు మనపై దృష్టి నిగుడ్చుటకువీలు లేదు. ఏలనన కొంకణములోని యడవిజాతులు వారిపై దిరుగుబాటు చేసినవి. ఇప్పుడు వారిననచుటకై బీజపూరువారు ప్రయత్నించుచుండిరి. మఱియును మనసరిహద్దులలోని బీజపూరువారికోటలను సైన్యనష్టమంతగా లేకుండనే యేయుపాయముచేసైన సాధింపవలసినదిగా నేర్పాటు చేసియున్నాను.

నేతా:- అంతియే కాదు. మనము సర్వదా వేగులవాండ్రను బిజాపూరు గోల్కొండల యందుండు నట్లుగజేసి యెప్పటివార్తలపుడు దెల్పించుకొనుచు తగురీతి నడుచుకొనవలయును.

మోరో:- అవును తానాజీ! అట్టియేర్పాటులును జరుగుచున్నవి.

(ఆబాజీ, అన్నాజీల ప్రవేశము.)

మోరో: ఓహో వచ్చితిరా? రండు ఎచ్చటినుండి యీరాక!

ఆబా:- బీజపూరునుండి వచ్చుచున్నాడను. ఇప్పటికి మనసరిహద్దులలోఁగల బీజపూరువారి కోటలను నాల్గింటిని పట్టుకొనగల్గితిని......సరికాని యిదియేమి! ప్రభువువారు ఢిల్లీకేగుదురట? ఆవార్తవిని వేవిఁట వచ్చితిమి.

మోరో:- అవును. ప్రభువుగారికి దర్బారునుండి యాహ్వానము వచ్చినది.

ఆబా:. అయిన ప్రభువుగారి నిశ్చయమేమి? వారు దర్బారునకు నిశ్చయముగా వెడలెదరా?

నేతా:- ఏమట్లనెదవు?

ఆబాజీ:- అనుటకేమున్నది? ఔరంగజేబునంతటి కుటిలుఁడు ధర మతియొకఁ డుండఁబోడు. ఇఁక మనప్రభువుగారియెడలానతని కౌటిల్యము నడుగనక్కఱయేలేదు. వనల నాతఁడెన్ని సారులు మోసగించెను. అట్టివాఁడింతలో నిట్లు మారెనన్న నమ్మశక్యమా! అసంగతిఁ దెలిసికొనకయే యిట్టి పరిస్థితులలో రాజ్యము విడిచి, యువరాజునుఁగూడ దీసికొని శత్రుమధ్యమునకు నరుగఁబోవుట శ్రేయస్కరమా!— ఈప్రయాణము నా కేమాత్రము నిష్టము లేదు.

అన్నాజీ:- నాకు నిష్టములేదు.

తానా:- నేను నయిష్టమునే సూచించితిని— కాని—

నేతా:- తానాజీ! మరల నిందలా? ఆబాజీ! ఇది ప్రభువుగారి నిశ్చయమై యున్నది. అంతియగాక మీరందు వెన్కల నాలోచింపక నూరకఁ దొందరపడినఁ బ్రయోజనమేమి?

అన్నాజీ:- ఇందు తొందరయేమియు లేదు. మేము నాలోచించితిమి. మనమీ యాహ్వానమును తృణీకరింతుమేని, ఫాదుషాతో మరల విరోధమగునని— కాని, యది యుపద్రవహేతువు కాజాలదు. ఏలనన నతనికిని మనకునుఁగల వైరమీనాటిదికాదు. ఒకవేళ నిష్కారణమున నతనికిని మనకును యుద్ధము సంభవించినచో గెలిచిన గెలువగలిగెదము. లేదా గుప్తముగా గణఁగియుండి సమయమును వేచి విజృంభింతము గాక! ఇఁకమనమీ యాహ్వానము నంగీకరించి ప్రభువువారిని దర్బారునకు నంపుదమేని నచ్చట నపాయమేమైన జరిగిన మనము చేయఁగలదేమి? ఈమాత్రము యోచనమక్కఱలేదా?

(శివాజీ ప్రవేశము)

అందఱు:. జయము మహారాజునకు జయము-

శివాజీ:- మోరోపంత్! మీరిచటికివచ్చి చాలసేపైనదనుకొనియెద— ఇంతవఱను నేమాలోచించిరి?

అన్నా: దేవా! తమరు ఢిల్లీకేగుట మాకేమియు నిష్టముగలేదు.— కాని,

శివా:- అన్నాజీ! నాకంతగా నిష్టము లేదు. ఇది ఢిల్లీశ్వరుని సాహాయ్యమును గోరుటకంటె భవానీ దేవి యాజ్ఞను గొని విచారింతుమేని ఢిల్లీకరుగ యుత్తమమని తోచును.

ఆబాజీ:- దేవా! యిద్దాని భవానీదేవి యాజ్ఞయనుకొనుటయెట్లు?

శివా:- ఎట్లా? అఫ్జుల్ ఖానునితో నొంటరిగా నెదుర్కొనుట యెట్లు తటస్థించినదో, యూర్ధ్వరము మాత్రిమే షైస్తఖానుమందిరమున జొచ్చి వానిని బారద్రోలుట యెట్లు తటస్థించినదో మొన్న మొన్న పురందరకోట మొగలుల వశమైనపుడు మన యిరువదికోటలను గోల్పోయి ఘాసపాసు లొంగుట యెట్లువచ్చినదో, దానివలన మనకు మేలుకలిగినదో, కీడుకలిగినదో విచారింతుమేని స్పష్టముకాగలదు భవానీదేవియాజ్ఞ యెట్టిదో.

మోరో:- నిజము.

శివా:- ఇపుడీ ఢిల్లీప్రయాణము నట్టిసంఘటనమే యని నా విశ్వాసము.

అన్నా:- విశ్వాసములను, అదృష్టములను కొంచెము కేపట్టుంచి మానవసహజబుద్ధితో నాలోచించి విచారింతము. నాకు దోచక యడిగెదను. ఏమి-తమరౌరంగజేబుయొక్క యాశ్రితవర్తనమును నిజముగా విశ్వసించియే యీ ప్రయాణము చేయుచున్నారా? లేక ఔరంగజేబు స్వభావమెఱింగియు వాడు చేయగలుగునదేమను నిర్లక్ష్యభావమును వహించి యేగుచుండిరా!

శివా:- ఓయీ! తెలియకగాని, నిర్లక్ష్యముచేగాని యీప్రయాణము నేనేర్పఱచుకొనలేదు. ఉత్తర హిందూస్థానమందలి వ్యవహారముల స్వరూపముగా బరిశీలించుటకిది యొక యవకాశముగా జేసికొంటిని. ఇందుకొఱకై ముందు నన్నిసంగతులతో బరిచయముగలుగ జేసికొనుటకును, నాకవేళ నేదేని యపాయము వాటిల్లిన నందుండి తప్పించుకొనుటకు జాలిన సాధనసామాగ్రి నుండుగనే సమకూర్చి యుంచుటకును రఘునాథపంతును ఢిల్లీకి బంపియుంటిని. కాన మనకు వచ్చిన భయమేమియు లేదు. మఱియు దాదాజీయు నేతాజీయు నన్ననుసరింతు మనుచుండిరి. ఇంకను సంశయ కారణమేమి? అదియునుంగాక రౌద్రహృదయమున సంయములకు దావొసంగ వచ్చునా? భీత్యాంకురములకు నవకాశ మొసంగ వచ్చునా?

సీ॥ ఘోరనిశితాసి ధారాప్రపాతర
క్తామిషాధ్వంబుల నరుగువేళ
శత్రువరూథినీ క్షాత్రదుర్గప్రభే
దన కార్యములయందు దరలువేళ
రాజనీతి జ్ఞానరచిత గూఢవ్యూహ
విచ్ఛేదనంబు గావించు వేళ
దురదృష్ట భూతసందోహా కృతాధైర్య
మేఘముల్ చెదర జృంభించు వేళ

సీ॥ కాంతి గోళంబులో! కన్నులో! గనరే
చెలువొందుచుండె రిక్కలవిధాన!
స్వఃప్రభా చక్రమో! వదనమో! చూడరే?
తనరారుచుండె చంద్రుని విధాన
స్వర్గసామ్రాజ్యమో! వక్షమో? యరయరే?
కొమరారు కరిమస్తకము విధాన
ప్రజ్ఞాధ్వజంబులో! బాహులో! తెలియరే?
చలియించుచుండె భోగుల విధాన

గీ॥ అదె మనోహర స్వచ్ఛ దివ్యప్రకాశ
మందిరమొ? యేమొ? యాపాదమస్తకంబు
రుచులనీనెడు బాలసూర్యుఁడో యనంగ
మహిత శౌర్యాధి రాజ్య సమాప్తినంగ॥

ద్వి:- (ప్రథమతో) చెలీ! దీనికి పిచ్చి పట్టినట్లున్నది చూచితివా?—

ఉన్నీ:- చెలీ! పటమేది? ఎంతసేపైనది?—

ద్వి:- ఆఁ పూర్తియైనది—పిచ్చి—

ఉ:- కన్నులు చిత్రించితిరా?— నేను చెప్పినంటిని కదా! ఇంతలో మీకీతొందరయేల?

ప్ర:- (ఈ యవస్థ యర్థముకాక తెల్లబోయి జూచుచుండును.)

ద్వి:- (ప్రథమతో) చెలీ! మనమిక పోవచ్చును. ఉన్నకొలదియు వికార మతిశయించుచున్నది. (అని ప్రథమతో పోబోవ)

ఉ:- ఇదేమి! ఎచ్చటికి పోవుచుంటిరి?

ద్వి:- మకిక్కడ పని లేదు. మావంటివారి వద్దకు.

ప్ర:- అబ్బ! ఊరకొనవమ్మా! ఆమెకేదో మతిభ్రమ కలిగినట్లున్నది.

ద్వి:- నీకును కలిగినది. ఇది యింకయు జూడ నాకును కలుగుచున్నది. మతిభ్రమణమంట! ఆచిత్రపటములో నేమున్నదని, యీమెకీ భావోద్రేకము కలుగుటకు—నీకెందుకు? రెండు నిమిషము లూరకుండుము. దానియంతట నదియే తిరిగివచ్చును.

ప్ర:ద్వి:- (నిశ్శబ్దులగుదురు. ఉన్నీసా చిత్రపటమును చూచుచుండును.)

ఉ:- చెలీ! యిది బాగుగనున్నదే! ప్రకృతిపురుష లక్షణములన్నియు నిందు వ్యక్తీకరింపబడినవి.

ద్వి:- చెలీ! అన్ని లక్షణములను బాగుగ నున్నవికాని, కోపపడక చెప్పు. యీ పటమెవరిదో!

ఉ:- ఇది యొకటి కాదు. కాజాలదు. శౌర్య సాహసౌదార్యాది గుణముల పరిపూర్ణమగు నవయౌ వనముట్టిపడిన యొక వీరుని స్వరూపమే యున్నచో నదియెట్లుండునో యూహించి దానిని స్థూల దృష్టి కందునట్లుగా మిత్రుడు చిత్రింపుచుంటిని.

ద్వి:- సరే దానికొప్పుకొందుము.— ఇంకనీ యున్మాదమునకు హేతువేమి?

ఉన్మా:- చెలీ! మీమాటలు నాకర్థమగుటలేదు. యున్మాదమేమి?

ద్వి:- ఉన్మాదమా! మరేమియును లేదు— కొంచెసేపటి క్రింద ప్రియదర్శనము—

ప్రి:- చెలీ! హాస్యము కాదు— ఇంతకు మునుపు నిజముగ నీవు కొంచెమున్మాదమునకు లోనైతివి— ఏమేమో పల్కితివి.

ద్వి:- (ప్రియముతో) యింకను నీకు సంశయమేటికి? ఈ చిత్ర రూపమునకును, తదాలోకన జనిత యున్మాదమునకు నేదో సంబంధ ముండితీరవలెను. (ఉన్మాదినితో) చెలీ! మతి యొకసారి యడుగుచున్నాను. నిజము చెప్పుము?

ఉన్మా:- ఎన్నిసారులడిగినను నిజము చెప్పుట కింతియే కదా!

ద్వి:- పోనీ నీకంత చెప్పుట కిష్టము లేనిచో మేమేల నిన్ను బాధింపవలయును. (ప్రియముతో) చెలీ! రమ్ము. మనమిచటనుండ నవసరము లేదు. (అని ప్రియముని సఖిని లాగికొని తనతోc దీసికొనిపోవును.)

ఉ:. ఏమి! వీరి భ్రాంతి!— (పటమును దీసికొని) యీ వీరుని రూపమిట్లనే యుండునా?— ఆc అదిగో అట్లనే యున్నది.—

(అవనిక జారును.)

# జేబున్నీసా

## తృతీయాంకము.

### రంగము 1.

స్థానము, ఢిల్లీదర్బారు.

సమయము. ప్రభాతము.

(పాదుషా ఔరంగజేబు, ప్రధాన సేనాపతి దిలేర్‌ఖాన్, దండనాయకుడు షైస్తఖాన్ హిందూసేనాపతి రామసింగు ఇంకను కొందరు సర్దారులు యథోచితాసనాసీనులై యుందురు.)

ఔరం:- మంత్రులారా! ఇంతటి ధననష్టమెన్నడు కలిగినది. మన బొక్కసము దాదాపు మూడు భాగములు నాశనమైనదే. ఇప్పటికిని మనకీరాజసింగు లొంగువాడగుపడుటలేదు.

దిలేర్:- ఎంత ధననష్టము- ఎంతసైన్యనష్టముకలిగినది- మంకీ పొగరుబోతు మూలమున___

షై:- ఈ నష్టమంతయూ మనము రాజసింగు నొద్దనుండి వసూలు చేయవలెను.

రామ:- ప్రభూ! మనకీ నష్టమొక్క రాజసింగువలననే కలుగలేదు-

ఔరం:- అవును. శివాజీవలనఁ గూడ గలిగినది- దుర్గాదాసువలన కొంతకలిగినది-

షై:- మొత్తముమీఁద హిందువులవలన కలిగినది. కనుకయీనష్టమును హిందువుల వద్దనుండియే వసూలు చేయవలెను.

దిలేర్:- రాజసింగు వద్దనుండిగాని శివాజీ వద్దనుండిగాని నష్ట పరిహారముల మనము గ్రహింపజాలము - ఇక నెవరివద్దనుండి గ్రహించుట?-

షై:- మన అధికారమునకు లోబడి యున్న హిందువులైన ప్రతివానినుండి మన యీనష్టమును పూర్తిసేయవలెను.

ఔరం:- అదియెట్లు!

షై:- మనము వారిపై నపరాధముపన్ను విధింపవలెను.

ఔరం: ఏమి యపరాధమును వారి కాపాదింతము?

దిలేర్:- అది ఆలోచింప వలసిన విషయమే!

షై: ఏమి అపరాధము కావలయును? మనరక్షణక్రిందనుంటూ, మనయుప్పు తింటూ, మనయధికారమున నున్న హిందువులు మన మతాశయములకు విరుద్ధముగా [illegible] [illegible]

నాతఁడు వంగి రావలసియుండును కదా! నీవు పోయి యతని నా ద్వారముననే తీసికొనిరమ్ము.

దిలే:- మంచిది. (ప్రస్థానము)

ఘోరం:. సైస్థఖాన్! ఈ శివాజీ కొఱకై యయిదు వేల సైన్యమున కధిపతులగు సేనాపతుల కూర్చుండు స్థలమున — నదిగో యచ్చట ఆసనము నేర్పాటు చేయఁబడెను. అతఁడు సభలోఁ బ్రవేశించిన తరువాత కూర్చుండుటకై నీవాతనికా యాసనముఁ జూపుము. అంతటి నీచస్థానమున నాతని, గూర్చుండఁజేసినఁ గాని యాతనికిఁ బరాభవము పూర్తికాదు.

(శివాజీ శంభాజీతో, సగర్వముగా ప్రవేశము.)

సై:. అదిగో— నీవా పద్దారులలో బోయి కూర్చుండుము. నీకా యుద్యోగ మీయఁబడినది—

శివా:. (కోపఘూర్ణితలోచనుఁడై యట్లే నిలుచుని యుండును. అపరిమితముగ చేయి కత్తి పైకిపోవును. తెరపడును.)



## రంగము 2.

స్థానము:- ఉన్నీసాగది.

సమయము:- మధ్యాహ్నము.

( ఉన్నీసా చింతిత స్వాంతయై ప్రవేశము )

ఎంతటి ద్రోహము— నా జనకుఁడెంతటి ద్రోహమొనర్చెను. ఇది యాతని నీచస్వభావమునే తెలియఁజేయును. కాని యా వీరుని కేమినష్టము? తా నెంత యాతని యవమానించినను నది యాతని విశేషమున కొక వన్నె నెపెట్టెను— ప్రవేశ ద్వారము తనకన్న పొట్టిగ నిర్మింపఁబడినపుడు నా తండ్రి యనుకొనినట్లతఁడు వంగి రాక నా శిరఃపాదుఁడై రొమ్ము విరిచుకొని సభను ప్రవేశించిన యాతని గాంభీర్యము నాకన్నులకుఁ గట్టియున్నట్లున్నది- యిప్పుడు-భళి— వీరునిలక్షణమట్టిదికదా!......... నేను నా మనః కల్పితవేగంబున చిత్రించుకొనిన నా దివ్యమూర్తియే యిది! అహా! ఏమి! పౌరుషమెట్లాతనియందు పరిణామమును జెందినది! పాదుషా తనను గౌరవింపక నుపేక్షించియున్నప్పుడును తనకొక సర్దారునిగా నియమించినట్లు తెలిసికొని వచ్చుచును- అతడెంత నిశ్చలముగానుండెను. తనకుఁ జరిగిన పరాభవమును తెలిసికొనినపు డా వీరుని శరీరమాపాదమస్తకమును క్రోధాగ్నిచే సంతప్తమై కంపించెను. నేత్రము లరుణరాగ పూరితములై విస్ఫులింగములగ్రక్కెను. ఒక్కమారు హస్తము ఖడ్గము మీదికి బోయెను. అవమాన తరంగంబులచే నాతని హృదయము మల్ల కల్లోల మగుచున్నను,- ఏమి అధీరోదాత్తత- పల్లెత్తు మాటనైన ననలేదే.- ఇట్టి వీరునా పరాభవించుట- ఇందులకా ఢిల్లీకి రప్పించుట! అదియు నా యోచన చేతనా- హా! దుర్భరము!- .—ఇంతవంతకు నేనే కదా కారకు రాలనైతిని ..................... అహా! నా మనః కల్పిత రాజ్యమందు, నే మహావీరుని గుణగణముల వినియుబ్బి తబ్బిబ్బులగుచుంటినో? యే మహాప్రతాపశాలి శౌర్యమునందాత్మను సమర్పించికొన్నియుంటినో, యే శౌర్య ధుర్యుని ప్రతాపము నహర్నిశములు జపించుచుంటినో, యే మహాపురుషుని నా హృదయ సింహాసనమునందు బ్రతిష్ఠించుకొని పూజించుచుంటినో ఆ మూర్తి- ఆ తేజోమయ మూర్తి--- అనంత కీర్తి--- ఆ నా యారాధ్యదేవుఁడు - దర్బారులోఁ బ్రత్యక్షమైనప్పుడు- నా హృదయాంతరము నుండి - అదేమి దైవాయత్తమో - యొక యనిర్వచనీయ ప్రేమకాముకము - కిరణమువలె మెఱసెను. స్వాంతము ప్రేమోన్ముఖము య్యెను. నాకోరిక లీరికలెత్తెను......నా హృదయ మామహారాష్ట్ర యోధాగ్రేసర చక్రవర్తి పాద పద్మములపాలు వ్రాలినది.- హా! హా విధీ! అశుభ మహార్ణమునకేల యంతలోనంతరాయముఁ గల్పించితివి? ......... అట్టివీరుని నవమానించు కట్టడి పనికి నా తండ్రియెట్లు లాడెఁ గట్టె? తండ్రియే యగుగాక! ఇంతటి యకృత్యమా! వీరునికిఁ గలిగిన పరాభవమునకుఁ బ్రతి విధాన మొనర్పవలదా?—నా తండ్రినిపుడే— యడిగెదనుగాక!

(ప్రస్థానము)

## రంగము. 3.

ప్రదేశము. ఆలంగీరు పాదుషా విశ్రాంతి మందిరము.

సమయము:- మూడవ ఝాము.

(ఔరంగజేబు పచారము చేయుచుండును.)

ఔరం:- ఎంత దొంగవేషము, శివినాడు. మోసములో నౌరంగజేబు తన పైచేయి యని యూహించెప్పటికైన గ్రహించకుండడా? గ్రహించక యున్నచో మొండైన గ్రహింపగలడు... రామసింగు గృహము వీనిని కనిపెట్టి యుంచుటకు తగు నేర్పాటులు గావించినది. కాని వీని నిపుడేమి సేయవలయును? ఏమి వీని యొత్తులు? తనతో వచ్చిన సైన్యమును తిరిగి తన దేశము పోవుటకై యనుజ్ఞ చేసుచు, నీ నుదయమున శివాజీ నాకొక లేఖ నంపెను. దానికింత కావలయునా? అత్యద్భుత నాయుద్యమములకు మరియింత సహాయకారిగ నుండెను కదా? తన సైన్యము నా దేశమును విడిపోయిన నాకేమి నష్టము? తానే మరియింత నిస్సహాయుండగును. అది నాకు క్షేమకరమే. కావున దానికి నేను వెంటనే యియ్యకొంటిని. ఇపుడొంటరిగ నున్నాడు. వీని నేమి చేయవలయును? గత పాపిని జేసి సామ్రాజ్యమునకు శాశ్వత భద్రమును కూర్చుకొందునా?...

(ఉన్నిసా తత్తరపాటుతో ప్రవేశము)

ఉన్ని:- జహాపనా! మహా సభయందు వీరుని యవమానింపదగునా? (దుఃఖరుద్ధకంఠయై పోవును.)

ఔరం:- (విస్మయచిత్తుడై కొంచెమాగి, యామె యాడిన వచనముల యర్థము గ్రహించి,) ఏమిది? ఏ వీరుడవమానింపబడియెను? శివాజీయా? ఆతనిపై యీమెకింత యభిమానమెందుకు?... తెలిసినది... హా... మతాంతరుని... కాఫరుని, విధర్మిని... నాతనయ... హా! (కొంచెమాగి) సరి- గ్రహించితిని... కుమారీ! ఆ కాఫరు మహమ్మదు మతమును స్వీకరించినయెడల వాని యపరాధములన్నియు క్షమింపబడును. వానిని వివాహమాడుటకపుడు నీకనుజ్ఞ నొసంగగలను. (అని ప్రస్థానము)

ఉన్ని:- ఏమి? నేనాతని వివాహమాడుటకు ననుజ్ఞ నొసంగుటకై యిచ్చటికి వచ్చితినా? వీరునికి గలిగిన పరాభవమునకు బదులు విధానమొనర్చుటకు మాత్రమే యిచ్చటకు వచ్చితినికాని హా! నాహృదయరహస్యరత్నము వెల్లడియయ్యెను కదా? అకటా నాహృదయ మీలజ్జచే జనించిన చింత నెట్లుసహించును. హా ఎట్టి దుర్భాషలాడెను. - అపవిత్రమూర్తి మతాంతరుడు కావలయునా?...... వలదువలదు...... ధర్మము నతిక్రమించుటచే గలుగుసుఖము......వలదు......నే నా మహాత్ముని వరించితిని. ఎంతచేత?...... అతడు స్వధర్మనిర్వాహకుండనియే కదా? ...... అతని వలచితిని...ఏల?...... స్వకంఠకుడనియే కదా? ఆ రెంటి విభూతము కలిగిన నా యారాధ్యమూర్తి మహిమను గోల్పోవదా? కాదు విహీనముకాదా? వలదు వలదు. ఆ వీరమూర్తియందు స్వధర్మ తేజము జ్వలించుచుండ నిమ్ము. నేను దూరమునుండియే యానందించెద గాక!.........శివాజీ

ప్రభూ? నీచరణ దాసియగు నన్ను పాలింపుమయిది......నీవెపుడు నాశోకోదయ పర్వతశిఖరము నధిష్ఠించి యుండవలయును. నీకయనాభిత్రసురాలు గు. నేను నీమూర్తిని ధ్యానించుచుయుందే యానందమందుచు నిర్లజ్జాతముగనే యుండవలయును ...... అవును... అదిచాలును—

(అవనికపతనము.)



## రంగము 4.

స్థానము రామసింగు గృహమునందొకగది.

సమయము-మధ్యాహ్నము.

(శివాజీ కూర్చుని యుండును.)

శివా:- (చింతాకులితస్వాంతుఁడై) ఆఁ .. రాజసేనము చేతిలోఁ జిక్కుకొంటిని. ఈ సారి మానము బహిరంగ యుద్ధము నందేయైనచో తెలిసి వచ్చెడి యీ శివాజీ సామర్థ్యము. ఔరంగజేబు! ఎంతటికుత్సిత పని చేసితివి. మాయమాటలచే ఢిల్లీకి నన్ను రప్పించి తుదకు చేసెడిపని యిదియా! - ......నీహృదయమును బ్రశ్నించుచున్నాను. నన్న వమానించుటకు నీకధికారము కలదో లేదో - యోధుఁడైనవాఁడు శత్రువుని రణరంగంబున నిర్జింప వచ్చును. అట్లుగాక — ఇంటికి సగౌరవంబుగ నాహ్వానించి వచ్చిన యతిథిని యవమానించు నంతటి నైచ్యమింకొకటికలదా? - దీనికి ప్రతీకారమేమి? నేనిచట బందీనైపోవలసినదేనా ......... నాస్వాతంత్ర్యమునకిపుడు రక్షణములేదా? ఎన్నియో కష్టములొంది గోమాతకొరకై బయలుదేర దీసినే నాస్వధర్మ రక్షణోద్యమ మింతటితో నంత మొందవలసినదేనా! ఇంతవఱకు చేసి నేనిపుడు తురుష్కులయధికార మునకు లోబడవలసిన వాఁడనగుదునేని భారతదేశ మూర్తియగు భవాని నాయండ తొలఁగిపోకుండునా? ఉద్యమము శాంతము సేయజాలని నా దురదృష్టము నేమను కొనవలయును? - ఏమి దీనికి బ్రతీకారము సేయఁజాలనా ?

(రామసింగు ప్రవేశము)

శివా:- ఎవరు? రామసింగు మహాశయులా?

రామ:- అవును- తమకు సర్వోపచారములు జరుగుచున్నవా?

శివా:- ఆఁ జరిగినవి.

రామ:- అదియేమి? ఇపుడు జరుగుటలేదా!

శివా:- ఏల జరుగకుండును?

రామ:- మా పరిచారకులు మీసేవయం దేమరకుందురు కదా?

శివా:- పరిచారకు లెప్పుడు నేమరరు.

రామ:- ప్రభూ! మీరేదో గూఢముగ మాట్లాడుచున్నట్లున్నది. మీమనస్సున నున్నది తెలుపగోరెద.

శివా:- ఇందు గూఢమేమున్నది. అంతయు స్పష్టమే కదా?

రామ:- అది తెలిసియు మీరు నన్ను నొప్పింపనేల?

శివా:- రామసింగుగారూ! తమ రట్లనుకొనుట కేమాత్రము నవకాశము లేదు. ఏలనన మేము భాదుషా అతిథులము. మా కేమియుపకారము కలిగినను నది వారొనర్చినదిగా భావింతుము. ఇందు మీ లోపమేమున్నది?

(ప్రవేశము: శంభాజీ)

ఏమి? శంభాజీ మన సైన్యములు తరలి పోయినవా?

శం:- అవును. నగరద్వారము వఱకు వారిని సాగనంపి వచ్చితిని

రామ:- ప్రభూ! సర్వసైన్యములఁ బంపివైచితిరేమి?

శం:- పాదుషావారి కతిథి సత్కారభార మెక్కుడగునని.

శివా:- కయ్యాగా? అట్లనరాదు. (రామసింగుతో) రామసింగు మహాశయా! మేము పాదుషా వారికి అతిథులమై యున్నంతవఱకు మాకు సైన్యములతో నేమిపని?

రామ:- మంచిది. తమకు జరుగు నుపచారములలో నెట్టి లోపములు జరిగినను మాకు దెలియ జేయుదురని నమ్ముచున్నాను. దర్బారు వేళయగుచున్నది. పోయివచ్చెదను.

(ప్రస్థానము.)

శం:- అనఘా! మనమిచ్చట నెన్నిదినంబులని యుండుట.

శివా:- అదేయింకను దెలలేదు.

శం:- తెల్పువారెవ్వరు?

శివా:- భవానీమాత

శం:- మనమిచ్చటకు వచ్చినపని ముగిసినదా?

శివా:- కొంతవఱకు

శం:- పాదుషావారు మనలసన్మానించి యింకను సెలవంపకుండిరి?

శివా:- సన్మానించుట యయినది.

శం:- ఇంక మనముపోకుండుటకుఁ గారణమేమి?

శివా:- మనసైన్యము ముందు పంపితిమికదా? —మనము పోగలము.

శం:- జనకా! తమరేదియో నాయొద్ద దాచుచున్నట్లున్నది. సైన్యమును ముందుగనే యేలపంపు చుంటిరని యెంతయడిగినను చెప్పరైతిరి. కత్తిలుఁడా యౌరంగజేబు మనలను—ఏదో మోసము చేసినట్లు నాకు దోచుచున్నది.

శివా:- అవును కుమారా! పాదుషా మనలను ఖైదు జేసెను.

శం:- ఏమీ మనలఖైదుఁజేసెనా? ఎంతధైర్యము వచ్చినది. ఇట్టిపని సింగముతోఁ జెలగాటలాడుట యని యాతఁ డెఱుంగడు గాబోలు.

గీ॥ ఉభయులును బంధితులు నిరాయుధులటంచు
గర్వమందుచునుండెను కాని యీమహా
రాష్ట్రవీరులచే వాడియీటిపోట్లు
తనకుఁ దప్పవటంచును దలఁపఁడొక్కొ॥

శివా:- కుమారా! వీరోక్తులతో మనకిపుడుకాఁగల ప్రయోజనమేమియులేదు. ఏయుపాయము చేతనైన మనమీ చెరసాలనుండి తప్పించుకొని పోవలయును. అటు పిమ్మట వీనిపనిఁ జూడవలయును.

శం:- ఏయుపాయముచే వీచెఱబాయుట

శివా:- అదియే యాలోచించుచుంటిని.

శం:- జనకా! నేతాజీయు రఘునాథపంతుని ఢిల్లీలోని యున్నారుకదా? వారికీ మనయవస్థ తెలియదా? తెలిసిన మనల రక్షించుటకై వారు ప్రయత్నించరా?

శివా:- ప్రయత్నింపకేమి? వారికేమి యాటంకములు కలిగెనో. ఒకటిరెండు దినములు చూచికానియేదియు నిశ్చయించుటకు వీలులేదు. కానిమ్ము. ఎట్లు జరుగునో చూతము — కానిమ్ము మనము స్నానమున కేగదము.

(ప్రస్థానము.)

## రంగము 5.

స్థానము:- రామసింగు గృహాభ్యంతరము.

సమయము:- సాయంకాలము.

(రామసింగు కూర్చుని యాలోచించుచుండును)

రామ:- ఏమైయుండును దీనికిఁ గారణము. ఈతని విడిపించుటలో నీమెకింతటి యాదుర్దాయేల? ఎన్నిమారులు చెప్పినది? ఎంత నొక్కి నొక్కి చెప్పినది? — నేనేమి చేయుదును? శివాజీని నేను విడిచిన ఔరంగజేబు నన్నుఁ బ్రతుకనిచ్చునా? విడువకుందునన్న రాజ్యచక్రమంతి నొక్క వ్రేలఁ ద్రిప్పుచున్న ఉన్నిసాబేగము వలన నాకట్టిమూడునో కదా? ఈసంగతిఁ దెలిసిన నా తండ్రి మండిపడకుండునా?-- హిందూధర్మము నుద్ధరింప బద్ధకంకణుండైన యిమ్మహారాష్ట్ర నాయకుని చెఱనుండి విముక్తి జేయుటయే ధర్మమనియే నాకును దోచుచున్నది. నామిత్రులగు రఘునాథపంతును నేతాజీయును నన్నీపనికై నిర్బంధించుచుండిరి. ప్రతికూలములకంటె ననుకూలములే యధికముగ నున్నవి. రహస్యము కాపాడఁబడునని యున్నిసా ధైర్యముఁ జెప్పుచున్నది. ఏమైనఁగానిమ్ము. ఈతని విముక్తికై ప్రయత్నించెదను.... కాని, మఱియొక చిక్కు కలుగుచున్నది. ఉన్నిసా తన విముక్తికి గారణమన్నవార్త శివాజీకి దెలియఁగూడదట. - ఇది యున్నిసా ఆదేశము. ఏయుపాయముచేతనో నీ కార్యము నెరవేర్పఁగలను.

(నేతాజీ, రఘునాథపంతు ప్రవేశము.)

ఎవరు? వచ్చితిరా మిత్రులారా?

నేతా:- అవును — మిత్రమా! ఏమి యాలోచించితివి?

రామ:- మిత్రులారా? నేను మీపనిచేసెదను. నామనస్సాక్షి యట్లు ప్రబోధము సేయుచున్నది.

రఘు:- ధన్యులము. — ఏమైన నుపాయ మాలోచించితివా?

రామ:- నాకేమియుఁ దోచుటలేదు. మీరేమైన యోచించియుంటిరా?

రఘు:- ఈయుదయమున నేను శివాజీతో ముచ్చటించినప్పుడు -- యాతఁ డొకయుపాయమును సూచించెను. అదియే యుక్తమని నాకును దోచినది.

రామ:- అదియేమి?

రఘు:- ప్రభువుగారు తమ కనారోగ్యముగ నున్నట్లు నటించుచుఁ గొన్నిదినములు గడపి తరువాత స్వస్థపడినట్లుగా జెప్పుచు నాయానందముచే వైద్యులకు ఫకీరులకు స్నేహితులకు గొప్ప యుద్యోగస్థులకు బహుమతులఁ బంచిపెట్టుట యను నెపమున తనగృహమునుండిఁ యితర చోట్లకు రాకపోకలు జరుపుటకు పాదుషానుండి యనుజ్ఞఁ బొందవచ్చును తరువాత తాను సంభాజీయు రెండు మిఠాయిబుట్టలలోఁ గూర్చుని తన స్నేహితుల గృహములకు నిటనుండి తప్పించుకొని పోవచ్చుననియు నంతమీదఁగాగల కార్యము లాలోచించుకొన వచ్చుననియు వారు సూచించిరి.

రాము:- సరి ఇది యుక్తముగానే యున్నది.

సీత:- అబుట్టల సన్నిహితుల యిండ్లలో బంగరుటకంటె నగరి వెలుపలకే తీసికొనిపోవునట్టు ఏర్పాటు చేయుటయే శ్రేయస్కరము. మఱియు రెండుగుఱ్ఱములనుగూడ బహుమతిసెపముగాని తెచ్చి యొక సంకేతస్థలమునందుంచుటయు నవసరము?

రఘు:- సరికాని, యాబుట్టలను బైటికి పోవుటెట్లు?

రాము:- (కొంచెము లోచించి) ...... దీనికొక యుపాయమున్నది. నేను చెప్పెదను. మీరీదినము మొదలు అందఱను నాటినుండియు ప్రతిదినము సరిగా రాత్రి పండ్రెండుగంటలకు యమునానదిలో బోటుచేసికొని కోటయొక్క యుత్తరమునందు బురుజుక్రింద వేచి యుండవలయును. నాకెప్పుడు వీలు చిక్కిన నప్పుడాబుట్టల బురుజుపై నుండి క్రిందకు దింపెదను మీరాబుట్టల నందికొని సురక్షితముగా దీసికొనిపోవచ్చును.

సీత:- ఈలోపుగానే మనప్రభువుగారి నాటకమాడవలెను. సరిగాని అసలది యెట్లు సాధ్యమగును?

రాము:- అదియొక పరమరహస్యము. మనకార్యమట్టుకు నెరవేరగలదు. దీనిని నే దృఢముగా చెప్పగలను.

రఘు:- సరి. మనమీతంత్రమును త్వరలో నిర్వహింప బూనెదముగాక!

రాము:- మంచిది. మనమిప్పుడు పోయి శివాజీగారికి ఈ విషయము సవిస్తరముగ దెలిపెదము.

(ప్రస్థానము)

## రంగము. 6.

స్థానము:- జేబున్నిసా మహలు

సమయము మధ్యాహ్నము.

( జేబున్నిసా చెలికత్తెలిరువురు ముచ్చటించుకొనుచుందురు.)

ప్రథమ:- అయిన చెలియా యీరహస్యము చక్రవర్తి కెట్లుతెలిసినది?

ద్వితీయ:- ఆయనకు తెలిసినట్లు నీ కెట్లుతెలిసినది?

ప్రథమ:- ఉన్నీసాను మందలించునప్పుడు నేను చాటుగనుండి వినుట తటస్థించినది.

ద్వితీయ:- ఎవరు మందలించినది- ఏమని ? నీవెట్లువింటివి?

ప్రథమ:- "ఆతడు మహామ్మదీయ మతమును స్వీకరించినచో నాతని వివాహమాడుటకు నీక నుజ్ఞ యొసంగబడును." అని చక్రవర్తి యున్నీసాతో నాగ్రహమున పలికి వెడలిపోయెను. నేను—

ద్వితీయ:- దౌర్భాగ్యముపట్టి యిట్లు తిరుగుచుంటివి.

ప్రథమ:- నీవెప్పుడు నింతేకదా! అయిన దానిని, కాని దానిని ఎగరగొట్టుటము, పోనీ—

ద్వితీయ:- మఱియేమో అంత విచిత్రముగ బలుకుచుంటివి. ఏమనుకొనుట!

ప్రథమ:- విచిత్రము కనుకనే విచిత్రముగ పలికితిని. ఉన్నీసా మనల వేధించిన చిత్రపటము సంగతి నీకు జ్ఞాపకమున్నదా!

ద్వితీయ:- ఉన్నది.

ప్రథమ:- ఆచిత్రపట మెవరిదని మనమెంత బ్రతిమాలితిమి. ఏమైన చెప్పినదా? ఇప్పుడది యెంతట నదియే తెలియనయినది.

ద్వితీయ:- ఇంతకు నాచిత్రపటమునందలి మూర్తిని ధరించినదారేమి సఖీ? చెప్పవు.

ప్రథమ:- ఆపట మెవరిదనుకొంటివి! మొన్న చక్రవర్తి మోసముచేసి ఢిల్లీకి రప్పించి ఖైదు చేసిన హిందురాజా శివాజీది.

ద్వితీయ:- ఆకొండయెలుకయా. ఛీ! ఛీ! చక్రవర్తి! యెంతటివాని కూతునకు—ఇదేమికర్మము చెలీ?

ప్రథమ:- చెలీ! మనము ప్రయత్నించిన దానిమనస్సు త్రిప్పగలమో ఊరక అనవసరంచుకొనిన ప్రయోజనముకలదా?

ద్వితీయ:- మేనత్తలకు వంకలంపెట్టి తాను చేయుచున్న విర్యాపార మదియా చాలుచాలు. ఎవరికి త్రిప్పుట ఇక నప్పుడు.

ప్రథమ:- సఖీ! అట్లనుచు తిరువా! చక్రవర్తి తనకుమార్తెయొక్క యీయవస్థను చాల భిన్నుడై అపేక్షలేని నచ్చెప్పి పశ్చాత్తాపము కలిగింపవలెనని నాతో నెంతయో జాలిగా చెప్పుచున్నాడు. మనమిట్లేమి—

( జేబున్నిసా ప్రవేశించి )

ఉన్నిసా:-

గీ॥ అధమ జీవనఘోరాహవార్తులగుచు
జనులు పొంగుదురేమి యాశ్చర్యమిద్ది
దుఃఖసుఖఘర్షణంబుల్వ దునియలయిన
యాత్మవృత్తికి శాంతియునంగనేమి?

ద్వితీయ:- ఏమియా ?

గీ॥ అధమ జీవనఘోరాహవార్తులగుచు
జనులు పొంగుదురేమి యాశ్చర్యమిద్ది
దుఃఖ సుఖ ఘర్షణంబుల దొలఁగు శాంతి
యని యెఱింగియుఁ గామాంధులగుదురేల !

చెప్పుటకేమి శాస్త్రము లేకరవు పెట్టవచ్చును. మనదాక వచ్చినప్పటికి- నాకెందుకు.

ఉన్నిసా:- మనదాక వచ్చునప్పటికి- ఏమి ?

ప్రథమ:- ఏమియులేదు. స్వోపజ్ఞత లోపించును.

ఉన్నిసా:- మనుష్యమాత్రులకది సహజమేకదా !

ద్వితీయ:- ఉన్నిసాకు మాత్రమట్లు కాదు.

ఉన్నిసా:- ఆఁ——

ప్రథమ:- ఆమె విద్యాంసురాలు. ఏమిచేసినను చెల్లును.

ద్వితీయ:- అవునులే, అవునులే, దానికి తోడు కవయిత్రికూడ నగునుకదా ! వన్నెయే.

ప్రథమ:- ( ఉన్నిసాతో ) సఖి ! ఏమిటాలోచించుచుంటివి?

ద్వితీయ:- నేను చెప్పుదునా?

ప్రథమ:- పోనీ చెప్పుము.

ద్వితీయ:- యావనమున మదవతులు దేనిని మిక్కుటముగ కాంక్షింతురు?

ప్రథమ:- భూషణాదులను లేదా కావ్యములను.

ద్వితీయ:- ఆఁ శృంగార కావ్యములనా? ఏకాంతమువలదా ? భోజనమును కాంక్షింపరా ?
ఎంతమృదువుగను సరళముగను భాషించితివే.

ప్రథమ:- పోనిమ్ము- నీవేమందువు?

ద్వితీయ:- పెండ్లిని. మనకన్న ఎక్కువ చదువుకొనినదికదా ఉన్నిసానడుగుము. (ఉన్నిసాతో)
ఏమమ్మా సఖి! కావలయునది పెండ్లియేకాదు?

ఉన్నీసా:- చెలీ! నేడిట్లు పొగించితివేమి!

ద్వితీయ:- నాకీమాటచెప్పుము. పెండ్లియగునా కాదా!

ఉన్నీసా:- అబ్బా! అవునే. ఇకనన్ను విడిచిపెట్టుము.

ద్వితీయ:- పతియొద్దకు పోవుటకా?

ఉన్నీసా:- ఛీ! పో- (దూరముగ పోవును)

ప్రథమ:- సఖీ! కోపపడకుము. గొప్పవాలమగుట ఒకించుక స్వాతంత్ర్యము అవల గలుగదము. ఒకదానికి ప్రత్యుత్తరమిత్తువా లేదా!

ద్వితీయ:- ఏమిటీనిర్బంధము. ఈవైపువచ్చినప్పుడే యీవైపునకూడ స్నేహభావమున్నప్పుడు కదా.

ఉన్నీసా:- ఎట్లైన సమకొనుము.

ప్రథమ:- దాని మాటలకేమి గాని ఒక్కటి తెలియగోరెద మనుగుదుము!

ఉన్నీసా:- చెల్లీ మీవద్ద దాపరిక మేమికలదు—

ద్వితీయ:- ఏదికలదో అదియే.

ప్రథమ:- నీవూరకొనవు- (ఉన్నీసాతో) సఖీ! అనుగుమంటిమికదా! నీ అభిమతం తెలిగింపుము. ఇప్పుడు నవయౌవనము ప్రాప్తించినదికదా?

ఉన్నీసా:- చెలీ! ఆ ప్రస్తావనమిప్పుడు వలదు.

ప్రథమ:- అటవలదు. యౌవనంబెట్లు సార్థకముగ వ్యయింపగలవు తెలుపరాదా?

ఉన్నీసా:- ఇప్పటివరకు నాకాప్రశ్నయే విచారణమునకు రాలేదు.

ప్రథమ:- ఇప్పుడు వచ్చినదికదా చెప్పరాదా!

ఉన్నీసా:- ఏమని చెప్పవలెను? విద్యా పరిశ్రమయందు, దైవచింతయందు, ధర్మసాధనమందు కాలమును వినియోగింపవలెను.

ప్రథమ:- ఇది విధాయకమే యగును. వీనిలోగలసియుంటియొక్క ముఖ్యమగు కర్తవ్యమేదా- ప్రత్యేకముగ లేదా!

ఉన్నీసా:- ఏమో ఆలోచింపవలయును.

ద్వితీయ:- పోనిమ్ము. నేనాలోచించి చెప్పితిని. నీయభిప్రాయము చెప్పుము. పెండ్లియాడవలయునా లేదా?

ఉన్నీసా:- ఇచ్ఛాధీనము.

ప్రథమ:- ఇచ్ఛాధీనమా!

ద్వితీయ:- రాజభవనవలదా-

ప్రథమ:- కర్తవ్యమాలోచించి చెప్పినమాటయే కాయిది?

ద్వితీయ:- స్త్రీజన్మయొక్క సార్థకత—

ప్రథమ: మాతృత్వము సందేహదా సిద్ధించును?

ఉన్నిసా:- నీవన్నమాట సత్యమే కాని అది వ్యక్తిప్రకృతిని బట్టియుండును. ఉద్వాహము విధాయకము కాదు. నిర్బంధముచేత చేయుపనిలేదు.

ప్రథమ:- అది యెందులకు-?

ద్వితీయ:- నీమాట చెప్పుము.

ప్రథమ:- నీకు వివాహమాడవలయునని యున్నదా లేదా?

ఉన్నిసా:- అదియేల యిపుడు? నేడిట్లు మొదలిడితిరేమి?

ద్వితీయ:- కాదు సఖీ! తెలియగోరెదము. ప్రీతితో నడుగుచుంటిమి. చెప్పుము. నీకు వివాహ మాడవలెనని యున్నదా లేదా?

ఉన్నిసా:- మీరు నాప్రాణసఖులని నాహృదయమును మీకు విప్పిచెప్పుచుంటిని. పరిణయపాశములచే గట్టుబడియుండుటకు నేను ఇచ్ఛయింపను.

ద్వితీయ:- నీమేనత్తలవలె—

ప్రథమ:- ఛీ! (అడ్డి) ఉన్నిసా! నీతత్వము విపులముగ జెప్పెదవా?

ఉన్నిసా:- ఏమున్నది. పరిణయవిధిచే లభ్యమగు సుఖములు క్షణికములు సంపూర్ణములు కావు. ఆధ్యాత్మిక చింతనమునకు జాలనివారు భౌతిక సుఖభోగములచే తృప్తిపొంది యుందురు. ముక్తిసిద్ధికి నొందదగినదే మార్గము రెండవదియు నెంతయో కాలమునకు వచ్చి తుదకా మార్గమునకే కలియును. బుద్ధిమంతులు ప్రథమమునుండియు సత్యమార్గమునే యవలంబింతురు.

ద్వితీయ:- ఈవేదాంతమును సృష్టించినది నీవేనా?

ఉన్నిసా: నేను సృష్టించుటయేమి. ప్రకృతిలోనే యీసత్యమున్నది.

ద్వితీయ:- ఇప్పుడు వివాహమాడిన స్త్రీలకందరికి అట్టి చింతనలేదు, మాకవయిత్రిమణి కొక్కతెకు మాత్రము—

ప్రథమ:- ఉండుము. (ఉన్నిసాతో) అయిన చెలీ! నీవేమార్గము త్రొక్కుదునని తలచితివి?

ఉన్నిసా:- మొదటి మార్గమునే.

ప్రథమ:- ఇక నీవెప్పటికి వివాహమాడనన్నమాట.

ఉన్నిసా:- (ఊరకుండును)

ప్రథమ: చెలీ! నీవు పొరబడుచుంటివి సుమా!

ఉన్నిసా:- ఏమాత్రమును గాదు.

ద్వితీయ:- ఎవరిని వివాహమాడనని యేల నీనిశ్చయము. అది ఆలోచించి చెప్పుము.

ఉన్నిసా:- ఒకనాటి యాలోచనము కాదిది. ఎన్నియో దినములనుండియు నాలోచించి నిర్ణయించితిని.

ద్వితీయ:- ఏమనీ వివాహమాడవు. వాళ్లని బాధయిస్తావా?

జేబున్నీసా:- ఆ—

ప్రథమ:- చాలు. అది అడుగుట యేమి నీవు ప్రతిజ్ఞ బట్టుట యేమి. మనమున్న సంఘధర్మములు కూడ విచారింపవలయును కదా!

జేబున్నీసా:- సంఘ విధులొకప్పుడు ఆత్మోన్నతికి భంగకరములుగ నుండును. అప్పుడు వానిను ల్లంఘించియే తీరవలయును. అదిదోషము కాదు.

ప్రథమ:- ఈ సంగతి విన్న నీతండ్రి చాలదుఃఖించును.

జేబున్నీసా:- నేను నాతండ్రిని వప్పియున జేయగల్గుదును.

ప్రథమ: ఇప్పుడా మాటకు గాదు. అతడు మాత్రము మనస్ఫూర్తిగ నొప్పుకొనునా? అసంభవము. నీ ప్రార్థనను త్రోసివేయజాలక ఒకవేళ నట్లనే యన్నను అతని హృదయమున చింతాగ్ని రగులుచు నేయుండును.

జేబున్నీసా: అందుకని ఎరిగియు బురదలో దిగవలయునా! అది ఆత్మవంచనము కాదా!

ద్వితీయ: ఈ యుపన్యాసము నాకు వలదు. నేనడుగుచున్నాను. నీవు పెండ్లిచేసుకొనెదవా లేదా?

జేబున్నీసా: నీవట్లని గ్రుంధించుట తగదు. ఒకమాట వినుము.

మ॥ తరుణీ! భౌతిక సౌఖ్యభోగముల జెందన్ గాదె వైవాహిక ।
స్ఫురణంబట్టి సుఖానుభూతి నెపుడున్ బొందంగ గాక్షింప సు।
స్థిర స్వర్గీయసుఖోపభోగరతి వాంఛింతున్ మనంబార ని ।
త్తరినుద్వాహమునాడుమంచు బలవంతంబేల కావింతువో ॥

సఖులారా ఇంత మొండిపట్టుకూడదు.

ప్రథమ:. మొండిపట్టు కాదు.

మ॥ చెలియా! పంతముకూడదింత మఱియే స్త్రీయిట్లు కావించె ము
న్నిల వైవాహిక సౌఖ్యమందక యె జీవింపంగ ధర్మంబె యీ
లలనాసృష్టి ప్రజాభివృద్ధికయి వాలాయంబు గల్పించె ని
శ్చలసత్యంబుగ దైవమా నియతి నుత్సర్జింపగా న్యాయ్యమే ॥

జేబున్నీసా:- చెలీ తీవ్రార్థమును క్షమింపుము. అజ్ఞానకృతములగు సంఘశాస్త్రమర్యాదలు కాని ఇవి స్వోపజ్ఞతగలవారి సత్యాన్వేషణము కేమాత్రము కాజాలవు.

ద్వితీయ:- సంసారమునందు నందరు నజ్ఞానులే కాబోలు. ఈమాత్రమాత్మచింత గలవారు లోకమ్మున వివాహమాడ లేదు,

ఉన్నీసా:- చెలీ నేనట్లంటినా! సర్వవిధముల యోగ్యుడగు పురుషుడు దొరకిన వివాహమాడిన అంగీకరింతును.

ద్వితీయ:- అట్టిపురుషుడు దొరకిన నీవు వివాహమాడుదువా?

ఉన్నీసా:- అడుటకభ్యంతరము మాత్రముండదు.

ప్రథమ:- అట్టిపురుషుడు లేడనియా.

ద్వితీయ:- మన మహమ్మదీయులలో నేనా?

ప్రథమ:- లేకపోవునా—

ద్వితీయ:- పోనిమ్ము హిందువులలో—

ఉన్నీసా:- ఉన్నను విధర్ములుకదా—

ద్వితీయ:- ఇవి హృదయమునుండి వచ్చుచున్నమాటలేనా?

ఉన్నీసా:- నేడు నీధోరణియంతయు విచిత్రముగనున్నది. ఏమి కారణము.

ద్వితీయ:- కాదు మేమొకసంగతి వింటిమి. ఇది దానికి విరుద్ధముగనున్నది.

ప్రథమ:- చెలీ! అసలు రహస్యమును విప్పిచెప్పెదను. మా అనుమానము- నీవు శివాజీని మోహించితివని వింటిమి—

ఉన్నీసా:- అకటా! యెట్టి దారుణవాక్యముల పల్కుచుంటిరి! అట్టిపవిత్ర హృదయుని మోహించి వానికి కళంకము నాపాదించి నేను పాపకూపమున ద్రోలుదునను కొంటిరా! నాజనకుడు కోపకళంబున నట్లాడినాడుగాక! ఇన్ని దినములు నాతో కలసిమెలసి యుండి శరీరములు వేరైన హృదయము లొకటిగనే మెలగినమీరు నీఉన్నీసాను శంకించితిరా! నిజము వినుడు. ఆ శివాజీ విజాతీయుడైనను, విరోధియైనను, అతనిస్వధర్మ నిర్వాహణదీక్షా పరాయణతనుచూచి నేను ముగ్ధనైపోతిని. అతనివీరత్వమును నిష్కళంక చరిత్రమును చూచి అభిమానించితిని. అతనియందు నాకుకలిగినది సత్యాభిమానముగాని మోహము కాదు.

శా॥ రాజన్యుండు స్వధర్మనిర్వహణ భారంబూనుటంగాంచి త
త్తేజోరాశి యనంతమౌటరసి ధాత్రీనాథ దుర్లభ్యమౌ
సౌజన్యత్వమునందు నుంటగని యీసత్యాభిమానంబు హృ
ద్రాజీవంబున సంజనించెను విధిప్రాబల్య సంస్థాయియై॥

ఇది కేవలము నభిమానము. అభిమానముయొక్క పరిణామమేమైన గానిండు,

ప్రథమ:- సఖీ—

ఉన్నీసా:- ఈ విషయమై యికప్రస్తావించిన నాయాన కలదు.

ద్వితీయ:- ప్రతిబింబమున్న చాలును. చెలీ మనముపోదము రా.

(ప్రస్థానము)

ఊన్నిసా:-ఏమి వీరికీ పిచ్చి! లోకసుఖములు వివాహైక లభ్యములని వీరివిశ్వాసము.

గీ॥ అరయ సంసృతీసంసర్గ పరత మెలగి
యనుభవించున దేమి మృత్యాసవంబు
పరిణయవిధంబుచేత ప్రాప్యంబు నరక
కారణంబైన తుచ్ఛభోగంబు వలను.

(ప్రస్థానము)

## రంగము 7.

స్థానము:— రోషనారా మందిరాంగణము.

సమయము:— సాయంకాలము.

(రోషనారా నాట్యముచేయుచు ప్రవేశము.)

రోష:- (నృత్యాంతమున) నాటినుండియు నామనంబేమియో కాని యాతనిపైకే పోవుచున్నది. అబ్బా ఏమి? అతనిశౌర్యము? ఆ గంభీరాకారమును నెంతసేపుచూచినను దనివితీరకున్నదికదా? ఆ మోహనాంగునితో గూడిభావజకేళి సల్పిసుఖించు భాగ్యము నాకెన్నఁడో? ఆహా! ఏమి అతనిమూర్తి—

సీ॥ మోమును దిలకింపఁ బూర్ణచంద్రునితోడ
బంతంబులాడెడి ఫణితిఁదోఁచు
వక్షంబునరయ దివ్యంబయై వెడఁదయై
హస్తికుంభ స్థలమట్లుతోఁచు
బాహులవీక్షింప బౌరుషోద్రేక ప్ర
జ్ఞాకేతనంబు లనంగదోఁచుఁ
గన్నులఁబరికింపఁ గామదేవునిచేతి
దీపికానీకంబు లీరుదోఁచు

గీ॥ అతని లావణ్యమును మోహనాంగకముల
పొంకమును బరికింపఁ బులకరించె
నాదుతనువెల్ల నట్టిసౌందర్యసార
ముద్రిమణి నింకనెన్నడు పొందఁగలనో॥

ఏవిధమునైనను నాతనిబొందవలెను, అతనిపొందు గాంచవలెను, అతని నిచ్చటకు దీసికొనివచ్చుటెట్లు? ఏమి? యీ రోషనారా సంకల్పము రిత్తవోవునా? అసంభవము... ఇందుకై ప్రయత్నించెదను......ఎవరో వచ్చుచున్నట్లున్నది.

(దాసీ ప్రవేశము)

దాసీ:- బేగంసాహెబా! వింటిరా యీసంగతి.

రోష:- ఏమి సమాచారము?

దాసీ:- ఆయన నేడు చిన్నిసా బేగమునకు మిఠా బుట్టలను పంపెను.

రోష:- ఎవరాయన?

దాసీ:- దక్కనునుంచి రాలేదా;— క్రొత్తయాతడు. రామసింగుగారి యింట్లోనున్నాడే ఆయన.

రోష:- ఎవరు? శివాజీయా? ఎపుడు? ఎందుకు? ఎవరి యధికారమున?

దాసీ:- అదియంతయు నాకేమి తెలియును. నేనిపుడు వారిలో జూచితిని. చూచినదేమో మీతో జెప్పితిని.

రోష:- ఆ మిఠాయి బుట్టలను తీసికొని పోవుచున్నదెవరు?

దాసీ:- ఉన్నీసా దాసీలే—

రోష:- ఆ విషయమైనీవు వారినేల యడుగలేకపోతివి?

దాసీ:- అడుగకేమి? అడిగితిని. ఆయనకీమధ్య జబ్బుచేసి కుదిరినదట. ఆయానందముచే ఆయాన యందఱికి ఫకీర్లకు ఫాదుషాలకు, మంత్రులకు, నౌకరులకు, బేగములకు దాసీలకు యీపన్నందికి పాదుషా యనుమతిచే బహుమతుల నంపుచుండెనట! ఉన్నీసాకును రెండు మిఠాయి బుట్టలను పంపెను.

రోష:- సరి బాగుగనేయున్నది. నీవుపోయి కాసీముని పంపుము.

(దాసీ ప్రస్థానము.)

ఏమి? ఉన్నీసాయైనా బేగము, రోషనారా బేగము కాదా! జహానారా కాదా! గుల్నారా బేగము కాదా? శివాజీ యున్నీసా కేల మిఠాయి నంపవలెను. ఉన్నీసా యాతని తనవలలో వేసికొనియుండవచ్చు.

(కాసిం ప్రవేశము.)

కాసిం! వచ్చితివా? ఉన్నీసాకొఱకై రెండు మిఠాయిబుట్టల నాపె దాసీలే గొనిపోవుచుండిరట! నీవు వారలనడ్డగించి నా యాజ్ఞగా యాబుట్టలను నామహలున జేర్పించుము.

కాసిం:- ఆజ్ఞ (ప్రస్థానము.)

రోష:- శాత్రవుని యున్నీసా వశముజేసికొనెనుగా? ఎంతజాణయైనది. పైకి పతివ్రతవలె కనపడునే కాని యీ కుర్రంతా రూపరికెదలివచ్చినది. తాను కవయిత్రిననియు, రాజనీతిజ్ఞురాలననియు, విద్యావంతురాలననియు డంబములగొట్టుచు లోపల జేయునది యిదియా? తాను మా ప్రవర్తనగూర్చి యాక్షేపించని రోజాలేదే? సరే. భాండారము నేటికి బైటబడినది. కాసీం యీపాటికిబుట్టలను నా మహలునకు జేర్చియుండవచ్చును. పోయి చూచెదను గాక!

(ప్రస్థానము.)

## రంగము ౪.

స్థానము - ఉద్యానవనము.

సమయము - మలుసంజ

(ఉన్నీసా తటాకతీరమున గూర్చొనియుండును.)

ఉన్ని:-గీ॥ యామ్యచనఁగ నుషోదయమగుచున్నుండు
సంధ్యమున దారకద్యుతు లలరుచుండు
గాఢజలదావృతా భ్రభాగంబులం ద
మేయ విద్యున్మరీచులు మెఱయుచుండుఁ
గాని చీఁకట్లువెల్లను గడవఁబొంద
నగు సహస్రార్కగోళ దివ్య ప్రకాశ
మైనయాయాయతనముమదాత్మకాంచ
గలుగునాఁడె నాజీవిత కాండ ముగియు!!

ఏమి? ఈ సరోజలము మౌక్తికస్వచ్ఛమై యెంతయుల్లాసకరముగనున్నది. ఈ నీరము సౌందర్యము యొక్క సారమువలెనున్నది. ఆ నడుమ కమలమొట్లు సరోతరంగడోలికల నూగుచున్నదో! అయిననొక్క నీటిబొట్టయిన దానినంటదుకదా? ఓకమలమా? నా జీవితమును నీ జీవితమునే పోలియున్నదినుమా.

ఉ॥ నేనొక పాదుషాతనయనే యయినన్ జరియించుచుండె మ
త్ప్రాణము సర్వదా యతిధిభంగి, మహావిభవంబునాకు సుం
తేని ముదంబుఁగూర్పదు నికృష్టదరిద్రత మున్గియుంటి నే
మానినులందు శ్రేష్ఠననుమాన్యత యొక్కటి నాకుజాలదే?

అహా! ఎందఱీసంసారమునకు వచ్చుచుండిరి, పోవుచుండిరి. ఇహ సుఖంబులఁబొంది తరించుచుండిరి? కాని ఈ జేబు-ఉన్నీసా జీవితము మాత్రము కాల్మలీపుష్పమువలె రాలిపోవలసినదే. ఇది దైవేచ్ఛకాబోలు.

(దాసీలిద్దఱు ప్రవేశము) ఎవరు?

దాసి:- బేగముసాహెబా! మేము తెచ్చుచుండగా రోషనారా సేవకుడైన కాసీంవచ్చి బలాత్కారముగా మా గంపలను లాగికొనిపోయినాడు.

ఉన్నీ:- ఎందుకని?

దాసి:- రోషనారా యాజ్ఞాపించెనట!

ఉన్నీ:- తెలిసితక్కువదాసీలు. అబ్దుల్లాను రేపురమ్మంటినని చెప్పిపంపుఁడు. పొండు.

(దాసీల ప్రస్థానము.)

నా యవివేకమువలన నెంతమూడినది? రక్షింతునని చెప్పి కుదకావీరుని యీపురికోట కందిచ్చితినే.

(అబ్దుల్లా ప్రవేశము.)

ఎవరు అబ్దుల్లా వచ్చితివా? నీవు నాకొక కార్యము చేయవలెను. నీ తెలివితేట లిందగు పడును. కాసింకును నీకును స్నేహమే కదా?

అబ్దుల్లా:- స్నేహం-అమ్మా.

జేబున్నీ:- మంచిది. నీవు వానిని నా వద్దకు దీసికొనిరావలయును. రానని యేమైన సాకు బెట్టినను తీసికొనిరావలయును.

అబ్దుల్లా:- అది యెంతమాట అమ్మా.

జేబున్నీ:- ఈపని నెరవేర్చితివా? నీకు మంచి బహుమానము నీయఁగలను.

అబ్దు:- సలాం బేగంసాహెబా! మెహర్బానీ ఉంచాలా

(ప్రస్థానము.)

జేబున్నీ:- కాసింకు ధనాశ చాలకలదు. ఎంతయైనకొసఁగి వానిచేతనే శివాజీ శంభాజీలను కోవసారామందిరమునుండి తప్పింపవలయును. ఆః ఈ సంగతి యామె నాతండ్రి కెఱింగించిన నెంతకష్టము. శివాజీ ప్రభూ! జేబున్నిసా నిన్నుఁ బ్రేమించుటవలన గలిగిన సుఖమా యిది! ఇందు చే సౌఖ్యము దీసికొనకుండిన యెడల నీవు నీరక్షణవిషయమై యిట్టిశ్రద్ధ దీసికొని యుండెడివాడవో. నన్ను నమ్మికొనుటచే నీ స్థితి యతిదుర్భరమయ్యెను కదా! నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించితిని. కాని నా ప్రేమయే యీ దురవస్థకు గారణమయ్యె. నేనే నిన్ను నీ మృత్యువునకు నొప్పజెప్పితి?

సీ॥ ఆపురందరు సంధియందు ఘోరములౌ ని
బంధనల్ నేనె యేర్పరచినాను
బిజపూరుపైదాడి వెడలు మొగలులతో
నిం జేర్ప నేనె యత్నించినాను
తండ్రికోరికమీద దర్బారునకు నిన్ను
వేవేగ నేనె రప్పించినాను
హతభాగ్యురాల నాడా నీపరాభవ
చేష్టను నేనె దర్శించినాను

గీ॥ ఖైదునున్నను భద్రత గాంచునిన్ను
రక్షణ నెపంబున నిసీ కరాళమృత్యు
వక్త్రగుహను ద్రోసినయాయభాగ్యురాల
నేనె పాపములకు మూలమైన నేనె॥

## రంగము 9.

స్థానము. రోషనారా గది.

సమయము. రాత్రి

(శివాజీ యాశ్చర్యము నొందుచు నిలువబడియుండును. రోషనారా వానియెదుట నిలువబడియుండును.)

రోష:- ఏమి! ఇటకెట్లువచ్చితివో నీవే యెఱుంగవా?

శివా:- (నిశ్చేష్టుడై యుండును.)

రోష:- ఎందుకువచ్చిన మాటలివి? పురుషులు రాత్రులయందు- రాణివాసములకెందుకు వత్తురు?

శివా:- తల్లీ! నన్ను క్షమింపుము. నా యీ మందిర ప్రవేశ మాకస్మిక ఘటనము కాని మదుద్దిష్టము కాదు.

రోష:- బుట్టలలో గూర్చొనుటయు దైవసంఘటనయే నాకేమిసాక్షి నీవు బుద్ధిపూర్వకముగా ప్రవేశించితివి గాబోలు.

శివా:- ఇదియేమి? తల్లి! నాకీ యగ్ని పరీక్షయేమి?

రోష:- దొంగల కట్టిపరీక్షలైన చేయవచ్చును.

శివా:- తల్లీ!

రోష:- ఓయీ! ఇక నన్నట్లు పిలువవలదు.

శివా:- అది దోషమా?

రోష:- దోషము. నాయాజ్ఞలేనిదే నాశయనగృహము బ్రవేశించుట దోషము, నా యిష్టము నెఱుంగకుండ నన్ను మాటమాటికి విపరీతముగా సంబోధించుటం దోషము. పోనిమ్ము. ఇన్ని దోషములను క్షమించెదను, నీవు నే జెప్పినట్లు చేతువా!

శివా:- (నిశ్చేష్టుఁడై చూచుచుండును.)

రోష:- నీయీమందిర ప్రవేశము భగవత్సంఘటన మంటివి. నేను నొప్పుకొనెద. అదియును భగవత్సంఘట్టమేయని నన్నుఁగూడి యిందు భోగకేళి సల్పుము.

శివా:- (చెవులు మూసికొని) శ్రీహరీ! చెడ్డదుర్దినము. ఎట్టి పాపవాక్యముల వినుచుంటిని? హతవిధీ! నన్నొక కాముకురాలి వశముఁ జేసితివా?

రోష:- సుందరా! యేటికి కంటగించు కొనెదవు?

వ॥ అనఘా! యేటికిఁ గలఁక నిన్వలచి కామాయాసముంబొంది యుం|
టిని నన్మన్ననఁ జేసి యిచ్చటను గ్రీడింపంగదే మన్ననో

ధనముంబ్రాణము దేహమః సుఖము స్వాతంత్ర్యంబు నీకర్పణం
బొనరింతున్ బడ దాసినౌదు ముదముం బొందింతు వీరోత్తమా॥

(సమీపించును.)

శివా:- (వెనుకకు దగ్గి) ఆఁ ఆఁ సాహసమువలదు. ఎంతటి యమానుషంబున కుపక్రమించితివి. నీకెవ్వతెవు—

రోష:- సుందరా! నేనెవ్వతెనా? ఆలంగీరు పాదుషాయొక్క సోదరిని, రోషనారను. సరియా మదనా!

గీ॥ హృదయపూర్వకముగను మోహించినాను
వలపు తలకెక్క నిన్ను నా ప్రాణనాథు
గా వరించితి నీవింకఁ గారవించి
కౌగిటనుఁ జేర్పవే మనఃకాంత నన్ను ॥

(శివాజీయొద్దకి పోబోవును.)

శివా:- ఆగుము. ఆగుము. ఇది నీ కుచితము కాదు. స్త్రీ ప్రకృతి యిట్టిదియా?— నీయుద్దేశ్యము తెలిసినది.

రోష:- తెలిసినదా? నా హృదయము నీకర్పించుకొంటినని తెలిసినదా? నా యీ ప్రేమ యనీదు యని తెలిసినదా? నా సర్వస్వము నీదియని తెలిసినదా— మనోహరా యొక్కసారి?—
(అని మీదికిబోవును.)

శివా:- అహో!— (వారించును)

రోష:-

సీ॥ మోహనాకార! నీమోముఁ జూచినయంత
నానందమెంతయు నతిశయిల్లు
సౌందర్య జితమార! సర్వాంగ దివ్యలా
వణ్యముఁ దిలకింప వలపుపుట్టు
వీరమణీ! నీదు వెడదయౌ వక్షంబు
దిలకింప నొడలెల్ల బులకరించు
లలనా జన సుమాస్త్ర! లలితమౌ నీవిలా
సముఁజూడ నెంత యాశ్చర్యమొదవు

గీ॥ మన్మనః కళ్యతోహరా! మానవతుల
కెల్లఁగాంక్షింపఁ దగిన లోకైకమూర్తి!

నీశుభాకృతిఁ గాంచ నక్షయమైన
కామనముగల్గి నిన్ మదిఁ గవయఁగోరు॥

మోహనా—

శివా:- ఉన్నకొలఁది నీకు మతి పోవుచున్నట్లున్నది. ఓహో ఎంత సాహసము— సుదతీ! నీవు నాకుఁ దల్లివంటి దానవు. నేను నీకుమారునివంటి వాఁడను—

రోష:- ఔను. నీవు నాకు— మరునివంటి వాడవు గనుకనే నేనిట్టి వ్యాపారమునకు లోనైతిని. నేను నీకుఁ జిక్కితిని. ఓమదనా! నన్నాదరింపవా—(పైబోవును.)

శివా:- అబ్బ! కాంతా! నన్ను క్షమించి విడుము.—

రోష:- ఒక్క సంగతిఁ దెలిసికొనుము. ఆలంగీరునామమాత్రమునకె పాదుషా గాని రాజ్యచక్రమెల్ల నాచేతిలోనున్నది. రోషనారా రాజ్యస్థాపన మాత్రమించినంతమాత్రమున జేబున్నిసా నన్నురక్షింపజాలదు. పాదుషా రాజ్యశాసన నిర్మాణవిషయమై యామెతో నాలోచించునే కాని యుక్తని రాజ్యమున నాశముఁజేయఁగోరుటయందేమి, యిట్టిఘోరముల నొనర్పుటయందేమి నాతో నాలోచించుచుండును. ఎఱుఁగుదువా? నీవు. నాయిచ్ఛ మన్నించి నన్ను జేపట్టితివేని.

సీ॥ శ్రీ మొగల్ రాజ్యలక్ష్మి వైభవంబెల్ల
నీ దివ్యపాద సన్నిధినిఁ జేర్తు
భూపాలనమున నా బుద్ధిప్రభావంబు
చే శత్రుకోటి నిర్జించి వైతు
చక్రవర్తిని నీదు చరణదాసుని జేసి
సర్వరాజ్యము నీకొసంగగలను
కాంభోజకాశ్మీర కర్ణాటకాది రా
జ్యములఁ బాతుదు నీ జయధ్వజంబు

గీ॥ తోడి రాజేంద్రులెల్లరు దోసిలొగ్గి
కప్పములఁగట్ట నీ యధికార ముద్ర
గౌరవింపఁగఁ జేతు నీకాశ్యపీత
లంబు సర్వంబు నీదురాజ్యంబుగాఁగ॥

ఇది నా ప్రతిజ్ఞ.

శివా:- (చిఱునవ్వు) ఏమి యీయసంబద్ధప్రలాపములు. ధర్మాతిక్రమణముచే స్వర్గరాజ్యాధిపత్యమే కల్గినను నియ్యకొనుటకీ శివాజీ హృదయము దుర్భరమనకొంటివా? ఇంక సామ్రాజ్య లాభమేకాదు. త్రిలోకరాజ్య శాసనము నాకు లభించినను. ఛీ! ఏమిమాటలాడితివి? పాతకండవు ఈ రాజ్యకాంక్షచే నిట్టి దురాగతముల

కిత్యాగోని నేనుధర్మచ్యుతుండ నగుదునా? నా వలన ధర్మమునకు హానియే కలుగవచ్చిన నేను నిస్సంకోచముగ మృత్యువును శ్రేయస్కరముగదలంతు. ప్రాణమున్నంత వఱకీ శివాజీధర్మమును ధిక్కరింపడు. ఎన్నికష్టములకైన శివాజీ యోర్చుకొనునుగాని తుచ్ఛ సుఖముల నాశించి స్వధర్మమునకు విఘాతమొనర్పడు. ఒనర్పఁజాలడు.

రోష:- ఎక్కడిమాటలివి?

శా॥ ఓయీ! సంసృతినెల్లరోసి వనులందున్నట్టి సన్న్యాసులే
మాయోపాయమణులన్న పేర్విని నసీమంబంతయున్ మానికా
మాయాసంబున గచ్చలూడగను స్థైర్యంబేది నారన్న నీ
వా యీనీతికి నిల్వగల్గెదవు ధైర్యంబన్న సామాన్యమే।

చాలు. చాలు. ఎందులకు వచ్చిన బింకములివి? నామాటవిని నన్నుంజేబట్టుము. నేను నిన్నెంతయు గాంక్షించియున్నాను. అనుగ్రహింపవా? నేను నీ [illegible] కురాలను. మనోహరా! (సమీపించును)

శివా: కాంతా! యేమి యీ సాహసములు. నా యిచ్ఛగాను.

రోష:- ఏమి సరసా! యివి నీ నిశ్చయోక్తులేనా? నా యాశాలతను ఖండింపివైచెదవా? ఇది నీకుఁదగదు. నా హృదయమునకు బరికోధింప నిటులనటించుచుంటివా?

మ॥ సరసా! యింతటి నిష్ఠురంబె! రమణీ సౌందర్య సామ్రాజ్య భో
గరతిన్ లక్ష్యము సేయవైతివిఁక స్వర్గంబన్న కాంతామణీ
గురువక్షోరుహసీమహాయిగను గూర్కొరిజెందుటో లేక నీ
విరసంబో? సరి యింకనైననను భావింపంగదే మోహనా?

శివా:- ఉన్మాదినీ! నీకు పిచ్చిముదురుచున్నట్లున్నది. నేనింక నీతో భాషించుట యుచితము గతోచదు. ప్రయోజనమును లేదు. ఇప్పటికైన నా నిశ్చయము నెఱింగి నీయుద్యమమును విరమించుకొనుము. ఇంకను నీవిట్లేప్రవర్తింతువేని నేను నీకట్టిప్రత్యుత్తరము నొసంగు వాడనుకాను. కాగలదానికి నెదురుచూచుచు దైవముపై భారమువైచి యూరకుందును.

రోష:- ఏమీ! ఇంతటిమూర్ఖతయా? కానిమ్ము అనుభవింపెదవు లెమ్ము.

శా॥ నాసౌందర్యము, యౌవనంబు, కుల మున్, నావిద్య, నాభాగ్యమున్,
నీసంబైనఁ గణింపవైతివిఁకదా? నీరుండవేయాదు పో
నీసామర్థ్యము, నీ జితేంద్రియతయున్నీ గర్వమును జూచెదన్
వాసింగాంచెదు రోషనారసను నాప్రజ్ఞా ప్రభావంబులన్॥

ఓయీ! నేను నిన్నెంతగ ప్రేమించితినో- నీప్రేమకొఱకై నాహృదయమెంతటి యావేదనఁ బొందెనో- నిన్నుఁగూడి సుఖించుటకొఱకై- నేను సిగ్గువిడిచి నోరార వచించితినో ప్రార్థించితినో - బ్రతిమాలితినో- యిప్పుడది యంతయు వ్యర్థమగుటచే నాప్రేమ విషమ్ముగమారిపోయెను. ఇఁక నీనాశనముకొఱకై ప్రయత్నించెదను. నీస్వాంత యిట్లుండిన నేనేమిసేతు. ఐన మించిన దిలేదు. నీకు తెల్లవారువరకును గడువిచ్చుచున్నాను. బాగుగ నాలోచించుకొనుము. నన్నుగూడి సుఖంబుండుటయా కాదని మరణంబొందుటయో—

(గదికి గొళ్ళెము బెట్టి వెడలిపోవును)

(యవనిక పడును.)



# చతుర్థాంకము.

## రంగము 1.

స్థలము. పాదుషా రహస్యగృహము.

సమయము. ఉదయము.

(ఔరంగజేబు సోఫాపై విచారముగ బరుండి యుండును. దిలేర్ ఖాన్ అతని ప్రక్కనొక యాసనముపై గూర్చుండి యుండును.)

ఔరం:- సహింపఁ జాలను,—దిలేర్ ఖాన్! నేనీయవమానమును సహింపజాలను.

దిలేర్:- అవును ఈయవమాన మసహ్యమే యగును. ఇది నాకును విపరీతముగనే బాధగట్టుచున్నది. ఎంతటి విద్యావంతురాలు—

ఔరం:- కనుకనే యీయకార్యము. అవిద్యయే లేకున్నచో తన ధర్మమును ధిక్కరించునంతటి ధైర్యమే యుండెడిది కాదు. తన కావిద్యయే యనర్థకమైనది—

దిలేర్:- విద్యను దూషింప నేమిటికి లెండు? శివాజీనిచ్చుటకు రప్పించినది గాని, రోషన్ అరా యగతించినదాదిగ నేత్రివలకును రాచకీయములందు నాలోచనల నొసంగుచున్నది కాని, యావిద్యయే కదా. దానికి మనము సంతసించుట లేదా? నేటికిగదా, యిట్లు కలిగినది. ఇప్పటికిని ఇది నిజమగునా యని సంశయము—

ఔరం:- ఏమి సంశయము. అది మోహాంధత్వమే గాకున్న, అట్లు తెగిపడి "వీరుని సభయందవమానింపతగునా" యని నన్ను అడుగునా.— కాదు, దిలేర్. ఆ అధముని జేబున్నిసా మోహించినది. అది నేను సహింపజాలను— వరించినది— ఛీ!

దిలేర్:- దేవా! అది మోహమనుకొన నేమిటికి. వట్టి అభిమానము కాకూడదా! విధర్మియే యగుగాక, శివాజీ యొక మహావీరుడు. సర్వమును మాతృనిచరణములయందు సమర్పించిన దేశభక్తుడు- నెత్తి పిడుగుపడనున్నను చలింపని ధర్మోపాసకుడు. ఇక జేబున్నిసా విద్యావిభూషిత, సరసురాలు. ఈమెకాతనియందు కలిగినది అభిమానోదయము కావచ్చును—

ఔరం:- దిలేర్! నీవు చెప్పకూడనిదేమి? నిన్న శివాజీ జేబున్నిసా మహాలునకు పోవుచుండగా రోషనారా చూచి పట్టుకుని ఖైదుచేసినది—

దిలేర్:- ఆఁ. ఆఁ. శివాజీ అంత మహాలునకెట్లు పోగల్గెను—

ఔరం:- వాడు కపటి, ఎంత నాటకమాడినాడు! జబ్బుచేసినదట! కుదిరినదట! అసంతోషమున నెల్లరకు బహుమానములు పంపినాడట! తానును తన కుమారుడును మిఠాయి బుట్టలలో గూర్చొని—

దిలేర్:- ఔరా—

ఔరం:- ఈ అవమానమును నేను సహింపజాలను; నేనిచ్చటనుండజాలను. దిలేర్ నే నెచ్చటికైన బోయెదను.

దిలేర్:- ఎచ్చటికైన పోయినంత మాత్రమున నీ చింత బాయునా?

ఔరం:- కాదు, నేనిక దాని మొగము జూడజాలను. నేనాగ్రకు పోయెదను.

దిలేర్:- దేవా—

ఔరం:- నన్నడ్డుపెట్టవలదు, జహానారా రోషనారాల దుశ్చేష్టలకే యెంతయో చింతించుచుండెడివాడను- ఇప్పు డున్నిసాయును వారి కక్షనే చేరెను. నా ఆశయములను— అభిమానమును— గర్వమును భగ్నములయినవి. పుత్రులను జాతమన్న నొక్కడొక్కడు నన్ను కబళించుటకై తగు ప్రయత్నముల జేయుచున్నారు. నాకు వృద్ధాప్యము వచ్చినది. నేనీ విషమ పరీక్షలకు దాళజాలను. నేనాగ్రకు బోయెదను లేదా మక్కాకు బోయెదను.

దిలేర్:- ఈ శివాజీ!

ఔరం:- శివాజీ! వాడెటులయిన పోనిమ్ము. కారాగృహమునందే— ఆ ఇనుప కటకటాలలో— కుడ్యపాషాణములలో— అచ్చటనే ధూళిలో— అతని తనువు కలిసిపోయిన కలిసిపోవును. జీవించువో నాజన్మాంతము దురదృష్టమున కేడ్చుచు నందే గూర్చొని యుండును ప్రథమమున వానిఛంపుదమనే యనుకుంటిని. అది వానికి తగిన శిక్ష గాజాలదు. రోషనార కూడ వాని కా జన్మఖైదు విధించుటకే కోరినది. వానినట్లే యుండనిమ్ము, నేనాగ్రకు బోయెదను—

దిలేర్:- అయ్యో! రాజకార్యములు సాగుటయెట్లు?

ఔరం:- రాజకార్యములు! నేటివఱకును రాజ్యచక్రమును నే నిచ్ఛానుసారముగద్రిప్పితిని. నా యిష్టము వచ్చినట్లు పరిపాలనాయంత్రమును నిర్మించితిని. ఈ రాజ్యవిధానమంతయు నౌరంగజేబుయొక్క బుద్ధియంత్రమే యనుకొనునట్లుచేసితిని. అప్పుడు నా రాజ్యచక్రము, అధికారచక్రము, భాగ్యచక్రము అన్నియు క్రమముగనే నడచినవి. నేడు నాకు వృద్ధాప్యమువచ్చినది. శరీరమునందలి సంధులన్నియు తెగుజాడలు పొడగట్టుచున్నవి. భాగ్యచక్రము భగ్నమగుచున్నది. ఇక నేనుండజాల. దిలేర్! రాజ్యవ్యవహారములు నవియంతట నవియేసాగును. ఈ విచిత్రమును చూచితివా?

దిలేర్:- ఏమి విచిత్రము.

ఔరం:- నేటివఱకును నే నేయంత్రమును నడుపుచు వచ్చితినో ఏ యంత్రమును నాకు దాస్య మొనరింపజేసికొంటినో, ఆ యంత్రమే నేడు నన్ను నడుపుచున్నది. నాపై నధికారము చేయుచున్నది. నే నా యంత్రమునకు దాసుడనైపోతిని. ఆయంత్రము నేడు నన్నాగ్రకు తరుముచున్నది. దిలేర్ నే నాగ్రకుబోయెదను.

దిలేర్:- హా—దుష్ప్రాప్తి.

ఔరం:- ఏమిదుష్ప్రవృత్తి! రాజ్యదాహముచే యశవంతసింహుని కాబూలునజంపించితిని. వాని కుమారుని విషము పెట్టిచంపించితిని. రాజస్థానములందలి రాజ్యముల నెన్నిటినో కృత్రిమమున లోంగదీసికొంటిని. హిందూయువతుల సధర్మమునిజంకక నే నుద్వాహ మాడితిని. నా రాజ్యసౌధమునకు ద్రోహమే బునాదియూది కపటము, మోసము, నాధారస్తంభములు— నాకుగాక ఇక దుష్ప్రవృత్తియెవరికి. నేటివరకు సుఖముగనున్న యీసంసారము నేడు, యంత్రిణాగారమయినది. నేనిం దుండజాల. నేనిం దుండజాల. హా! ప్రపంచమారణ మొనర్ప నాచే సృష్టింపబడిన ఈభూతము నన్నే దిగమ్రింగుచున్నది. నాశరీరాంగకములు, రక్తనాళములు, శల్యములు, శీర్ణములైపోయినవి. కేనీవేదన సహింపజాలను. నే నా గ్రాకుబోయెదను, మక్కాకుబోయెదను, దిలేర్! యెచ్చటకునైన బోయెదను—

(పరుగెత్తి పోవును.)

దిలేర్:- వికలుడైనాడు. వికలుడైనాడు. దుష్ప్రవృత్తి కీడునవలయును.

(ప్రస్థానము.)

## రంగము 2.

స్థానము- ఉన్నిసా గది.

సమయము మధ్యాహ్నము.

(ఉన్నిసా విచారముతో ప్రవేశించుచు)

ఉన్ని:- చ॥ అకటకటా! యిదేమి యొకయాపదపైనొక యాపదమ్మొ నీ
త్రికమక లేలహా! హతవిధీ! భరియింపఁగఁజాల నీ పరీ
క్షకు మితియైన లేదె! చెఱసాలఁ గృశించుచునుండె ధర్మర
క్షకుఁ డొకఁడా మహామహుని సాకి ననుం బలిగొమ్ము దుర్విధీ!

అయ్యో! ఈదుష్ప్రాప్తి కేమనవలయు? తుదకు జరుగ వలసినదిదియా! "శివాజీ దొంగతనముగా పారిపోవ యత్నించినాడు. దానికి ఉన్నిసా తోడ్పడినది" అని పలుగురు నిందించుట యొకటైనను, పోనీ ఈనిందకేమి అని యూరకుందునా "సిగ్గుచెడి బ్రతుకుచున్నది" అను మాట వచ్చునుగదా! ఏమిదారి! ఇట్లు ఇందుకును చెడితిని. అటు శివాజిని రక్షింపజాలకనే పోయి యుందును చెడితిని. ఏమిదారి! నలుగురిలో నిక తలయెత్తుకొని తిరుగుటయెట్లు!......ఇంతమానుదునా...... ఇంతమానుదునా అటుకాదు......అటుకాదు. ......ఒకవేళ ఆ వీరుని యొద్దకు పోయి "శివాజీ! నీకొరకై యీ స్త్రీ యిట్లయినది" అని వెంటబెట్టుకొనిన నాతని హృదయము కరుగకుందునా! ఇప్పటికైనను నాతడిందుకు వల్లె యనినచో... ఒకదారియగపడుచున్నది...... నేనుపోయి యాతనితోడ సంభాషింతును. ఇది వినా వేరొక తెరవుగలదా; ఇచ్చటనుండి ఇంతవెల్లడియైన బ్రతుకు బ్రతుకజాలను...అబ్బ! హృదయము బ్రద్దలయినట్లున్నది. ఆ వీరునిపై మోహమును తీసివేయ జాలకున్నదాన ...... మతమును ధిక్కరించు నాటి సమర్థురాలను గాకున్నదాన ఇది నిర్వహించుకొనుట కష్టమేగనే యున్నది. అయినను ఇదిజరుగునా......
ఇదిజరుగునా......

గీ॥ అతఁడు నేనును దాంపత్యమంది భవసు
ఖంబులఁగనుట దైవేచ్ఛగాదు; కాక
యున్న నన్యోన్యవైరుధ్య మున్న కులము
లందు నతఁడు నేనును జన్మ మందనేల?

ఛీ! ఈసంఘనియమము లెంతటి దారుణములు! మనస్సునకు వచ్చినవానిని వలచి, వరించి; కూడి సుఖించుటకు వీలులేదుకదా; ఆ-ఆ- ఏమిఆలోచన యిది.

॥ అతని యందలి యేస్వధర్మాభిమాన
భావమునుజూచి ముగ్ధనైవలచినానొ
అట్టి ధర్మంబువంచించు టని యెఱిఁగియు
నిట్టి పనులకు నెటులుద్యమింతునేను.

ఇంతటి హృదయ దౌర్బల్యమేమి? ఏమంటిని— హృదయ దౌర్బల్యమా! హృదయ దౌర్బల్యమా! హృదయదౌర్బల్యమా!

గీ॥ పరమపావన చరితుఁడు భవ్యగుణుఁడు
శౌర్యపుంభావుఁడలఘుఁడు సత్యకాముఁ
డయిన వీరాధివీరు మహానుభావు
వలచుటయుఁ గూడ హృదయ దౌర్బల్యమగునె;

ఈ నాపవిత్రమగు నిష్కల్మషమగు కామము హృదయ దౌర్బల్యమేయని లోకమనుకొనిన ననుకొననిమ్ము. దాని పాపిష్ఠబుద్ధికొక నిట్టూర్పువుచ్చి యూరకొనెదను. అంతకన్న చేయున దేమి; ఇంతటి యవమానమున కోర్చి ఇకనిందు బ్రతుకజాలనుకదా! అతడు నాప్రార్థన మంగీకరించి నన్నుఁ జేఁబట్టునేని అదిమేలు. ఎన్నిపాట్లైనబడి అతని చెఱనుండి విడిపించుకొని పోవ గల్గుదును. బంధు మండలిలో నీతనికిని నాకు వచ్చిన పాట్లేవచ్చునెడల.........అతడు నాప్రేమ మంగీకరింప వలయునేగాని నిజకరుణాభిక్షకు రాలనగు నాకొఱకై యతడు సిద్ధముగ నుండ వలయునేగాని... అంతగ తప్పినచ్చిన... ఆమాత్రము సుఖముగ మనజాలమా... ఆమాత్రము సుఖముగ మనజాలమా...

ఉ॥ ఏవిపినాంత రస్థలము నే నివాసముగా గ్రహించి మో
దావహచిత్తవృత్తిని జలాకరమందలి తేఁటనీరముల్
ద్రావుచు యోగ్యభూరుహ ఫలంబులమెక్కుచు ప్రేమరాజ్యల
క్ష్మీ విభవంబు పెంపున సుఖింపమె జీవితముం దరింపమే॥

(ప్రస్థానోద్యతయగును)

(ప్రవేశము కోపవాశ)

కోపవాశ:- ఉన్నిసా! ఉన్నిసా! ఆలోచించితివా?

ఉన్నిసా:- (వెనుకకుమరలి) ఆలోచించుటకేమున్నది.

కోప:- మఱి అంగీకారమేనా?

ఉన్నిసా:- అత్తయ్యా! నన్ను క్షమింపుము. నేనొకని వివాహము చేసికొనను.

కోప:- ఒకనిగాకున్న ఊరివారినందరను జేసుకొమ్ము. నీకింతకా—

ఉన్నిసా:- (కంటకించుకొని) అబ్బ! నేనిందుండజాల (పోబోవును)

కోప:- ఆగు. ఆగు. ఎచ్చటికిపోవుట. నేడీసంగతి తేలనిదే వెళ్ళుటకు వీలులేదు.

ఉన్ని:- అంత ఘోరమగు సంగతి తేలుటయెట్లు?

కోప:- తేలుట యెట్లా! తేలవలెను.

ఉన్ని:- తేల్చుట నాచేతగాదు.

రోష:- (చెయ్యిపట్టుకొని) చేతకాదు. ముండగాళ్ల నింటికి తెచ్చుకొనుట చేతనగునా.

ఉన్ని:- (చేయి వదలించుకొని) నన్ను విడిచిపెట్టుము. మీ మాటలు నాకర్థముగుటలేదు.

రోష:- ఎల్లర్థమగును. కామము పెదదున గప్పినపుడు వివాహము చేసికొనఁదగు! పురుషులు స్త్రీలను భోగదాస్యములుగా చూచుకొనుచుండిరట! దహ్యమద వానలజ్వాలలో స్త్రీల నాహుతి యొనర్చుచుండిరట! అలీఖాన్ నీకంత చులకనైనాడేమి! నీకన్న నాతఁడెక్కుడు విద్యావంతుడే.

ఉన్ని:- కాదని యెవరనిరి?

రోష:- మఱి అతని నేల వివాహమాడవు.

ఉన్ని:- అతనికి లేని అలమట మీకేలకో.

రోష: అతనను వివాహమాడవలదనెనా?

ఉన్ని:- అలీఖాన్ నిన్నుదయము నాయొద్దకు వచ్చెను. నాయభిమతము నడిగెను "అలీఖాన్ నాకు వివాహేచ్ఛయే లేదు. క్షమింపుము. కేడేమో సంఘమెంకయంత్రము వలె నడచుచున్నది. అదేమో నాకిష్టము లేదు." అంటిని. అతఁడును నాతో ఏకీభవించి "నిజమే నేనును వివాహమాడ" నని చెప్పి వెడలిపోయినాడు. అతడెంతయోగ్యుఁడు.

రోష:- నీ పిచ్చివానికిగూడ పట్టించితివా! మనలోమాట. ఇంతకును నీవు వివాహమాడకుండుటకు కారణము.

ఉన్ని:- కారణమా? ఇదినన్నడుగవలదు.

రోష:- అడుగవలదా! అవునులే. అవునులే.

ఉ॥ ఎంతటి జాణవేనగుదు వేమి యెఱుంగనియట్లు ధర్మసి
ద్ధాంతము లిట్లు వల్కెదు యదార్థమెఱుంగనె నేను నీదు దు
శ్చింతలు దాచ దాగునె? యిసీ! నిజమాడిన నిష్ఠురంబు నీ
స్వాంతమునన్ వరింపవె? యభాగ్యుని కాఫరునిన్ నరాధమున్

ఉన్ని:- ఆః ఏమి మాటలివి—

రోష:- ఏమిమాటలా! ఏమిమాటలా!

మ॥ వినుమా! నీమరహస్య మేనెఱుఁగుదున్ వీరుండెయౌనా శివా
జని యా కాఫరునిన్ వరించుదువె ఛీ! ఛీ! మా మొగల్ సత్కులం
బునకున్ నేటికి మచ్చకల్గెజుమి నీ మూలంబునన్ గామచిం
తనపెల్లైన వరింపు మేమొగలునైనం గొంతశాంతించెదన్॥

అగునా! ఇది నిజముగునా?

ఉన్ని:- (నిరుత్తరయగును.)

రోష:- ఏమి మాటలాడవు ? నీ దొంగతన మెవరెఱుంగనిది. ఆవేళను ఇచ్చటకు వచ్చినది నిన్ను తేవదీసికొనిపోవుటకా! ఎప్పటినుంచి మీకీసంబంధము—

ఉన్ని:- మీమాటలు—

రోష:- ఊఁ కష్టముగానున్నవి—

ఉన్ని:- అవును (పోబోవును.)

రోష: కష్టముగ నేలయుండవలెను. అతనిని నీవు మోహించుట నాకు తెలియదా! శివాజీ మొదట దర్బారునకు వచ్చినపుడు మన మిరువురము పరదా వెనుకనుండి అతనిమాడలేదా! అప్పుడే నీ యందు మోహోదయచిహ్నములు పొడగట్టినవి. అతని చెయ్యి కత్తిపైకిపోయినపుడు నీవు నాలుక కరచుకొనలేదా ఏమి మాటాడవు. శివాజీ శంభాజీలను మిఠాయిబుట్టలలో బెట్టి నీ మహలునకు దెప్పించుకొనునపుడు నేను కాదా చూచిపట్టుకొని అతని ఖైదు చేసితిని, ఏలదాచెదవు. అది నీపని అగునా కాదా?

ఉన్ని:- నాకు తెలియదు.

రోష:- తెలియదు. దుష్కార్యములొనర్చి వృద్ధుడగు తండ్రిని అలమటపెట్టుట తెలియును. మతమును పాడుచేసి కాఫరునొక్కని కామించుట తెలియును. నీతండ్రి ఆగ్రికేల కదలిపోయెనో నీకు తెలియునా! నీ మొంగము చూడనొల్లక—

ఉన్ని:- అయ్యో!

రోష:- అయ్యో! ఎందుకువచ్చిన అయ్యోలివి. మొక్కు మూలములేని అయ్యోలు. నామాటవినకుంటివేని నిజముగ అయ్యో యనియే యనిపింతును. ఇప్పటికి మైన మించినదిలేదు. ఆలీంఖానుని పెండ్లిచేసికొనుము. నీతండ్రి సంతసించి మరల ఇంటికివచ్చును. ఈ రహస్యము తెలిసిపోయినదే అనివిచారింపకుము. ఎవరికిని తెలియలేదు, మన అంతఃపురము దాటిపోకుండ నేనుచేయగలను. అధీరవుగాకుము.

ఉన్ని:- నాకేమియును వలదు. నన్ను విడిచిపెట్టుడు.

రోష:- గయ్యాళీ! ఇంకను బుద్ధిరాదుగా.

ఉన్ని:- ఒకరి కున్నదిగదుక బుద్ధి—

(కటాలున నిష్క్రమించును.)

రోష:- ఆ! ఆ! ఎంత తెగించిమాటలాడితివే. నాకు తెలియును, నాకు తెలియును. ఇప్పటికిని ఉన్నిసా శివాజీని మోహించుటమానలేదు. నాకు నతనికి మధ్య నిలుచున్న దీకంటకమే. నాకన్న నిదిచిన్నదియగుట చేతను నవయౌవనయగుటచేత నతడును దీనికామించియున్నాడు. అదిసాగనిత్తునా! ఎన్నటికైన నాతడీ రోషనారాను ఆలింగన మొనర్పకొనవలెను. లేదా ఆ ఇనుపకటకటాలమధ్య అంతే నిలుగబడి చావవలయును. ఉన్నీసా! నీకతడు దక్కడు. నీకతడు దక్కడు, నీ వాతనివిడిపింప యత్నించుచుంటివి. అది సాగనీయను. అది సాగనీయను,

(ప్రస్థానము.)

## చతుర్థాంకము.

### రంగము. 3

స్థానము. ఆగ్రానుండి మధురకుబో ప్రమార్గము.

సమయము. వేకువ.

(శివాజీ ప్రవేశము.)

శివా:- అమ్మరో! యీ శివాజిని మహాపదలం గడ వంగఁజేసి బం
ధమ్ములనెల్ల రాలిచి స్వధర్మము గాచికొనంగఁజేసి ని
త్యమ్ము కృపామతిందనిపి ధర్మపథంబున నుండఁజేసి తో
యమ్ము! భవాని! వందనములమ్మ కృతజ్ఞుడనమ్మ శాంకరీ!

మాతా! ఎన్నియాపదలనుండి నన్నుద్ధరించితివి. నీయాకరుణ అవ్యాజముగదా! అవును.

గీ॥ బాల్యముననుండి నన్ను భవానిమాత
యే కదా దయతోడ రక్షించుచుండె
సకల దురదృష్టముల గెల్వఁజాలుటరయ
నా భవానీ కృపాలోకనమునగాదె ॥

అహా! ఎంతటివిపత్తునుండి బయల్పడితిని, కారాగారమువనున్నది ఒక్కదినమైననది యెంతబాధకరముగ నుండెను. హా! విశ్వవిజయసమర్థంబగు పరాధీన ప్రవేశముండగు పాదుషా చేతిలో నొంటరిగఁజిక్కి యనుకోనివిధంబున చెరసాలనుండి బయలువెడలుట యెంతటి యదృష్టము. మిఠాయిబుట్టలలో దూర్చుని పారిపోవుచున్నది నా సాహసము మెట్లుపరీక్షింపబడినది... ఏమి యపూర్వసంఘటనము ఆ రోషనారా యెవరు? ...... రోషంగకేమి సోదరియా! నేనా పెకట్లుచిక్కితిని. పొరబాటున మేము దాగ్యుండినబుట్టలామె మహాలునకుఁజేరియుండునా! ...... ఆమె నన్ను జూచినంతనే మోసమన్న కటింగింపక క్షమించినదేమి? ......ఔరా! తనయిచ్ఛనుమన్నింపమి నన్ను కారాగారబద్ధుని గావించినది. ఏమి స్వతంత్రము! ఈ ఆలంగీరుని ప్రభుత్వము తుదకు స్త్రీ హస్తములయందునా తిరుగుచున్నది ... ఇట్టి కామినుల చేతిలో... అహహా హా! ఏమికామమిది? ఎంతటి తీవ్రమయినదా కామజ్వరము! స్త్రీ ప్రకృతి నుత్పన్నంచజేసినదే! ఎంతటి విచిత్రములైన కలవుగదా ఈ మొగల్ అంతఃపురములో!......ఎంతటి సమర్థురాండ్రుగలరు ... ఎట్టితంత్రములు ... ఒక్కరిని మించిఒకరే! .... ఆ చెరసాలయందే నాజీవితమంతము కావలసియున్నదని నిరాశచేసికుంటి....అందే నాజీవితముయొక్క చరమసంధ్య యని యనుకొంటిని. అట్టిదురవస్థలో ఎవరా కోమలమూర్తి సంపూర్ణసానుభూతితో నన్నును కంభాళిని చెరవిడిపించి బురుజులపైనుండి క్రిందనదిలో, నాప్రజనము ప్రతిరయములో మందురని ధైర్యముజెప్పి దింపెను ...అవ్యక్తియెవరు... నక్షత్రప్రకాశములో సామూర్తి కరుణదేవతవలె నాకు బొడకట్టినది. ...ఒక్క మాటయైనపలుకలేదు. నేను నాకృతజ్ఞత నెంతప్రశస్తముగా తెలియజేసికొందమన్నను నాకా యవకాశమైన దొరుకలేదే... ఇంతకు నది స్త్రీవ్యక్తియా పురుషవ్యక్తియా యేదియు తెలియకలేదే. కరుణాగద్గదికమగు కంఠస్వరమాత్రము స్త్రీదివలెనే యున్నది. స్త్రీ యగుచో నా విముక్తికొరకింతటి శ్రమపడ నేమికారణమో! కాముకో!

కరుణరో! ఆహా! ఈ కోటల అంతఃపురమున నెట్టి విచిత్రవ్యక్తులుగలవు? ... ఎంతటి విచిత్రసంఘటనమిది... ఆ హాదురవస్థలో నా దయామూర్తి సాక్షాత్కార మెంతటియపూర్వము! అహోభుమ ........ అనూహ్యము.

సీ॥ మృత్యుధూమచ్ఛాయ లిరికినగుహాయందు
　　వెలసిన యొకచల్వ వెలుగువోలె
భీకరమగు నొక చీకటిలోయలో
　　మెరసిన యొకదివ్య కిరణమువలె
పొంగిపొరలెడు సముద్ర సమగ్రసీ
　　మను దృగ్గతుండైన యినునివలెను
కలుషఘోరాత్మభాగముల నెందుండియో
　　యొలికిన సౌఖ్యనిస్తులమువలెను.
గీ॥ కష్టభూయిష్ఠ భవకూపగర్భమున న
　'హెూ' యని పొగలువారి కేలూతయగుచు
　స్వర్గదేవతయే నాదు భాగ్యమునను
　పృథ్విసాక్షాత్కరించిన విధముతోచె॥

ఏమి ఆదృశ్యము!... మరణమన్నను మరపునకువచ్చుటలేదే— అశ్వముల కొఱకై యేగిన నేతాజీతానాజీలింతవరకును రారైరేమి చెపుమా! నావిముక్తికి కారణమైన ఆవ్యక్తియే అశ్వములను సిద్ధముగుంచెదనని చెప్పియుండెను. ఎచ్చటనో— ఏమో— నేనిందరిజాలముల మధ్య బడియుంటిని. ఇచ్చట నేను జాగొనర్చిన ప్రమాదము సంభవించునే—

(ఒక అశ్వమును సుసజ్జితముచేసి తీసికొని ఉన్నిసా పురుష వేషమున ప్రవేశము)

శివాజీ:- ఎవరు? నేతాజీ! గుఱ్ఱములు దొఱికినవా?

ఉన్ని:- (గుఱ్ఱమును శివాజీముందునకు త్రోయును)

శివాజీ:- (గుఱ్ఱమును పట్టుకొని ఒకచేతితో చలించుచు) మిగిలిన గుఱ్ఱము లెచ్చట. సంభాజియును తానాజీయు నశ్వములమీద వచ్చుచుండిరా! (నిదానించిచూచి) ఎవరిది. అయ్యా తమ రెవరు?— నాస్వజనముకొని భ్రమచే—

ఉన్ని:- భ్రమయేల—

శివాజీ:- నా స్వజనముకొని భ్రమచే—

ఉన్ని:- అయ్యో! భ్రమయేల?

శివాజీ:- ఇదియేమి? అయ్యా తమరెవరు?

ఉన్ని:- చెప్పజాలను క్షమింపవలెను.

శివాజీ:- పోనిండు. ఇటకు మీ వచ్చినపనియేమి?

ఉన్ని:- ఆ గుఱ్ఱమును తమకు — శ్రీ — వారు పంపినారు

శివాజీ:- ఎవరు?

ఉన్ని:- మీ విముక్తికి కారకులైనవారు.

శివాజీ:- అయ్యా. తమరు వారి సేవకులా!

ఉన్ని:- అదియంతయు మనకేటికి? తమరీ అశ్వము నధిరోహించి త్వరితముగ పలాయనముగండు. తమకుమారునకును మిత్రులకును గూడ నశ్వముల నేర్పాటుచేసితిని. వచ్చుచుందురు.

శివాజీ:— అహా: తమ యుపకారమునకు నే మని కొనియాడుదును.—

ఉన్ని:- రాధా—

శివాజీ:- ఏమి ప్రత్యుపకార మొనర్పగలను—

ఉన్ని:- నీవి స్తోత్రపాఠములు మాని యిటనుండి త్వరితముగ వెడలిపోవుటయే నీవు మాకు చేయు ప్రత్యుపకారము— నేనిట నుండుటయే తమ కార్యమునకు భంగము వలెనున్నది.

(పోబోవును)

శివాజీ:- అయ్యా! మీకైన గరుణ కలుగదా—

ఉన్ని:- (వెనుకకు మరలి) ఇదియేమి రాధా!

శివాజీ:- ఈ నరకమునుండి నన్నుద్ధరించిన ఆ మహోపకారు డెవరో తెలిపి పుణ్యమునుఁ గట్టుకొనవా?

ఉన్ని:- అయ్యో— దానివలన నీకేమి ప్రయోజనము?

శివాజీ:- ప్రయోజనమా— ఎట్టి ప్రత్యుపకార మొనర్చి నే నీ ఋణమునుండి విముక్తుడను కాగలను

ఉన్ని:- కాని, అది అసాధ్యము. వలదు. రాధమణీ నీకా చింత వలదు. సుఖముగ నీదారిని నీవు పొమ్ము. (పోబోవును)

శివాజీ:- ఒనర్చినది యుపకారమే యనుకొమ్ము — అయిన నీమానస మింత కఠినమా? ...

ఉన్ని:- (వెనుకకు మరలి) వీరాగ్రేసరా? ఆవిషయమునుగూర్చి ప్రసంగ మింక మానవుకాక నన్నేటికి దూషించెదవు.

శివాజీ:- క్షమింపుము. నిన్ను దూషించుటకు కాదు నేనట్లంటిని. ఆ యుపకారిని తెలుప రాదంటివిగదా! పోనిమ్ము. నాయందింత సానుభూతి జూపుచున్న నీ కర్తవ్యమేమి! అది యైన గరుణింపుము.

ఉన్ని:- రాధా? ఎంతచెప్పిన నాప్రస్తావము మానవుగదా! పోనిమ్ము చెప్పెదను, నన్ను ఖుదాబార్ అందురు.

జున్నీ:- అది దక్కను పావల్దారువలెనున్నది. మనలశత్రువులు గాఢముగ యాలనసైనికులు బాణములు వదలుచున్నట్లున్నది.

శివా:- మనకిపుడు యుద్ధముగాక గత్యంతరములేదు. ఏదీ ఎవరివద్దగాని ధనుర్బాణములుగలవా?

నేతా- దేవా ఇదిగో (అని అందిచ్చును.)

శివా:- వారు మనలసమీపింపకముందే మనము వారలపరాక్రమార్చవలయును. నేనిటనుండి బాణపరంపరలచే రిపుల నిరోధించుచుండెదను. (నేతాజీ తానాజీల జూచి) మీరిరువురు ఇతర మార్గముగబోయి వారిగుంపుజొచ్చి కత్తియుద్ధము చేయుడు. వారు ముప్పదిమందికన్న నధికముగ లేనట్లున్నది.

తానాజీ }
నేతాజీ }:- ఆజ్ఞ. (నిష్క్రమణ.)

శివాజీ:- కుమారా! నీవిట్లుండుము. శత్రుల పరాభవ మర్చెదను. (బాణములవదలుచుండును.)

శంభాజీ:- జనకా! ఒక్కొక్క బాణమునకే శత్రు లెట్లు పారిపోవుచుండిరో! నాకొక ధనస్సుండిన నేనును యుద్ధము సేయువచ్చునుగదా!

శివా:- వత్సా! మేముండగ నీకు శ్రమయేటికి? (వింటినారితెగును) ఆ! ఏమి దురదృష్టము. వింటినారి తెగిపోయెనే. విధి నన్నిట్లు శోధించుచుండెను....

జున్నీ:- ఏమైనది రాజా!

శివాజీ:- ఏమిచెప్పుదును. నా దురదృష్టముల కంతములేకున్నది. శత్రువులు నన్నాక్రమించు చుండిరి. ఏకధన్వుని... వింటినారి తెగిపోయినది. ఏమిచేయునది.

జున్నీ:- రాజా! అధీరుడవు కాకుము. నీవింటికి నారిని నేకల్పించెదను. (శిరమునుండి కొన్ని కుంతలముల ద్రెంచి పేని వింటినారిగా కట్టియొసంగును) ఇదే వీరవరా! సకలధైర్యము దెచ్చికొనుము నీవుదీనితో స్వర్గధన్వులనైన జయింపగల్గుదువు.

శివా:- కృతజ్ఞుడను (విల్లందుకొని) యుద్ధముసేయును.

జున్నీ:- (శివాజీవంక నోరగజూచుచు నిష్క్రమణము)

శివా:- శత్రువులెల్లరు పారులైరి. నేతాజీతానాజీలు ఇటే వచ్చుచున్నట్లున్నది.

(అటునిటుజూచి)

కుమారా! ఇపుడిట నున్నాకడెటుబోయెను.

శంభా:- జనకా! నేను యుద్ధమును జూచుచు వానిని జూడనైతిని.

శివా:- ఆహా! ఈ ఘటనా వైచిత్ర్యముల కంతము లేకున్నదే! ధనస్సు తెగుట. ఈ కోమలాంగి వింటి నారిగా కుంతలములద్రెంచి యొసంగుట! కోటబురుజులపై నాటీముల వక్షితో స్తుతినించిన ఆ అంతఃచిత్రవ్యక్తియు నీవ్యక్తియు నొకటి కాదుకదా! ఏమియు తోచకున్నది!

శంభా:- జనకా! తానాజీ నేతాజీలనుగలసికొందము.

శివా:- అట్లనే ఏగుదము కుమారా పద. (నిష్క్రమణము)

# రంగము. 4

స్థానము: మధురకు బోవుమార్గము.

సమయము. ప్రభాతము.

(రోషనారా పురుషవేషమున ప్రవేశము)

రోష:- శివాజీ ఉన్నిసాను తీసుకొనిపోయినాడు. నేను ఉండటనే యనుకొంటిని. వలలో ఆకలట అతని నేసి కొనిపదని. అదియే అతని విడిపించినది. కానిమ్ము. ఎప్పటికిలోవునో చూచెదంగాక! దక్కను మావల్లారుని దుసుమాడి, వీరుపారిపోయిరి. ఔరా! ఏమి సాహసము, శివాజీ! ఎంతసాహసము చేసితివి. రోషనారను తిరస్కరించితివి! తెలియునా! రోషనార అబలకాదు, అంత చేతకానిది కాదు చచ్చినట్లు పడియుండుటకు! నిన్ను సాధించితీరుదును. ఉన్నీసాకంత గర్వమా కదా! చూదుము. దానిరూపటనే నీవు నా ఆలింగనమున నుందువు. అట్లు చేయజాలనిచో నేను రోషనారను కాదు. శివాజీ! ఏమి ఉన్నిసా యందలి వలపే నీకు లేనిచో అంత అన్యకాంతా పరాఙ్ముఖుడవేమి! నీవు మనుష్యశివాజీవేనా లేక ఏ అపరిజ్ఞాతమగు లోకము నుండియైన దిగివచ్చితివా! నీశుద్ధత్వమును గనుగొనియెదగాక! మధురలో శివాజీని ఖైదుచేయుటకు ఆలీఖానుకు వార్తనంపితి. ఏమైనదో చూడవలెను. ఉన్నిసా! నీఆటలు మా తరిమి సాగవు. జాగ్రత.

పరిస్థానము.

## రంగము. 5

స్థానము. — మధురనుండి ప్రయాగకుపోవు మార్గము.

(శివాజియు, ఉన్నిసామహమ్మదీయుని వేషమునను ప్రవేశము.)

శివా:- మునిషీగారూ! తమదయచేత నేనెంతయు కృతజ్ఞుడను. తమ యీ మేలు నెన్నటికిని మరువను. తమయొక్క కృపకు హేతువేమియో తెలియంగ.

ఉన్ని:- సాధుత్వము మానవవిధి కదా—

శివా: నన్ను మీరెట్లు తప్పింపగలిగితిరి?

ఉన్ని:- ఆర్భటాలికి లంచమిచ్చి విడిపించితిని.

శివా:. ఏమాత్రమిచ్చితిరి? —

ఉన్ని:- అప్రియంగుటెటికి! మావిధి నేను నిర్వర్తించితిమి, మాకిచట నేమిపని— ఇక బోయి వత్తము.

శివా:. ఇదిన్యాయమా? నాచే సంభావనలంది పోదురు గాక!

ఉన్ని:- మాకట్టికోరిక లేదు.

శివా:- మీకు లేకపోవచ్చును. కాని, మాయానందము కొరకై, యధఃపాతాళము నుండి సముద్ధరించిన తమరియెడ మాకుగల కృతజ్ఞతను జూపుటకైన మాకవకాశ మొసంగగూడదా?

ఉన్ని:- ఓయీ! అల్పసంతోషి! మీకు మేమే మపకార మొనర్చితిమని—

శివా:- అహో! ఇది యుపకారము కాదా—

ఉన్ని:- అంతఘనమైనదా?

శివా:- ఏమి మీసౌహృదయము, జాత్యాభిమానముచే నన్ను మీరు రక్షించితిరనుకొనెదమన్న నేను మీజాతివాడను కానే? మిత్రభావమున ననుకొనెదమన్న పూర్వపరిచయమైన లేదే

ఉన్ని:- నీవు లేకున్న మాకు మీతో చాలాపరిచయము గలదు. ఇంతకు నేమి జాత్యాభిమానము మిత్రత్వము నేనా పరోపకారమునకు హేతుకములు! మనుష్యత్వముయొక్క ధర్మమే పరోపకారముకదా! ప్రేమించుటకొరకై జీవింపుము? అనునదియే ప్రకృతిధర్మము.

శివా:- ధన్యుడను తమయుదారహృదయమునకు. తమవంటి సామాన్యులైన నీదీనునికిం దెల్పి కృతార్థుని జేసెదరా?

ఉన్ని:. వెఱ్ఱివాడా! యేమికోరిక యిది. నామమును దెలిసికొనినంతమాత్రమున నానందపరిణామ సాధనమునకు సోపానము లేర్పడునా?

శివా:- (నవ్వును.)

ఉన్ని:- నవ్వెదవేల?

శివా:- దురదృష్టాదృష్టములయొక్క సంఘర్షణప్రకృత్యము జూచిన నాకు నవ్వువచ్చుచున్నది.

ఉన్ని:- అదియేమి?

శివా:- ఏమున్నదిగీ ఢిల్లీనుండి యిచటకు వచ్చునంతలో మూఁడుమారు హతాశుఁడనైతిని. ప్రథమమున నొకయవ్యక్త తేజోమూర్తి నన్నుద్ధరించినది. ఆ మూర్తిని సంతృప్తికరముగ వీక్షించుటకు నైన నాకవకాశము చిక్కలేదు. రెండవపర్యాయ మొకభటుఁడు నా వీఁటి నాకొఱకై తనతురంగను ఖండించియిచ్చి నన్నుద్ధరించెను. అతఁడును తిరిగి చూచునంతలో నదృశ్యుఁ డయ్యెను. ఇది మూఁడవపర్యాయము. ఇప్పటి నా స్థితి ప్రత్యక్షప్రమాణమేకదా? ఏమి యీ యపూర్వసంఘటనము లెందుకొఱకై యుద్దేశింపఁబడినవి—

న్ని:- రాధా! యా తేజస్విఁడవు కాకుము. నా నిజస్థితి నీకు దెలుపుటకు గురునాజ్ఞలేదు. తెలిపి నను నీకు ప్రయోజనములేదు. ఆ విషయమై నీవింక జింతింపకుము. ఇక నిచ్చట నాలసించుట నీకు శ్రేయస్కరము కాదు. నీకొఱకై పాదుషా సైనికులు తిరుగుచుందురు. నీవు సాధ్యమైనంతత్వరగ నడ్డత్రోవలఁద్రొక్కుచు నీమాతృదేశమును జేరుము.

శివా:- ఓ పరోపకారా! నీవు నాకు సన్నిహితుఁడకన్నను బ్రేమాస్పదుండవైతివి, ఈహృదయము నీలో నైక్యముఁజెంద గోరుచున్నది. నీ నేత్రాంచలములందలి యాసౌమనస్యమరీచి, నీ పలుకులయందలి మాధుర్యము, నీశరీరము యొక్క సాత్త్విక కాంతిక విన్యాసము, పవిత్రహృదయము... నన్నిటినిజూచి ముగ్ధుఁడనైపోతిని. నీవు నామిత్రుఁడవు. పరలోకయజ్ఞాతబంధుత్వ మేర్పడినట్లు నాయంతరాత్మ యుద్బోధించుచున్నది. నాహృదయమునకు నీ వధిపతివి. సెచ్చెలీ! నాహృదయమును నీహృదయమునఁ జేర్పనిమ్ము—

(తన్నిసా పారిపోవును.)

యవనికపడును.

## రంగము-6-

స్థానము, ఆగ్రాకోట.

సమయము, సాయంత్రము.

(ఔరంగజేబు శయనించియుండును. రోషనార ప్రక్కన కూర్చునియుండును.)

రోష:- ఎచ్చటికిబోయెదవు?

ఔరం:- ఇచ్చటను సుఖముకలుగుటలేదు. నేను మక్కాకుబోయెదను. మరెచ్చటికైనబోయెదను.

రోష:- మనస్సులో ఆవేదన యున్నపుడెచ్చటికి పోయినను సుఖముగలుగదు. అన్నా ఇంతకును కారణమేమగును.

ఔరం:- కాదు. సోదరీ! కాదు. నేను సహింపజాలను. నామతమునకవమానము కలిగినది. నాకవమానము కలిగినది. నేననుకొనినదంతయు నైనది. నాకుజరుగరాని అవమానము జరిగినది--

రోష:- అవును దానికిప్రతిక్రియ సేయవలయునుగాని ఇట్లధీరుడవయిన నేమిప్రయోజనము. షయిస్తఖానుని రావించిప్రబలసైన్యముతో మహారాష్ట్రముపైకి దాడివెడల నాజ్ఞాపింపుడు.

ఔరం:- రోషనారా! అట్లనే పంపెదననుకొనుము. దానివలని ప్రయోజనమేమి? ఒకవేళ శివాజీహతుడైన కావచ్చును. అతనిరాజ్యము విధ్వంసమయిన నగును. అంతమాత్రముచే నీయవమానము తొలగగలదా! నాపౌరుషమంతయు భగ్నముచేసి పోయినదే— ఉన్నిసా శివాజీని మోహించినది. అతనివిడిపించుకుని పోయినది, ఇదిదుర్భరము--

రోష:- దుర్భరము. నిజమే. దుర్భరమే. కానిదానికి ప్రతిక్రియయేమి?

ఔరం:- ప్రతిక్రియ, ప్రయోజన విహీనమగు ప్రతిక్రియ. రోషనారా! నాబుద్ధియంత్రము శిథిలమైనది. నాకే ప్రతిక్రియయువలదు. నేనిచ్చటనుండలేను మక్కాకుబోయెదను.

రోష:- అది ధీరలక్షణముగాదు. చక్రవర్తి పలుకవలసిన పలుకులు కానివి.

ఔరం:- నా చక్రవర్తిత్వము నాటితోడనే పోయినది. ఏనాడు రాజకీయములలో స్త్రీలను జోక్యము కల్పించుకొననిచ్చితినో—

రోష:- ఇకనిందలకు దిగుచుంటివా?

ఔరం:- కాదు, సోదరీకాదు. నేను నిందించుటలేదు. గారాబముచేగాని మీయందలిప్రేమచేగాని విద్యాబుద్ధి సంశోభితలను గౌరవమువగాని నీకును ఉన్నిసాకును రాజ్యవ్యవహారములలో ప్రమేయము నొసంగితిని. దర్బారులలో ప్రత్యేక స్థలమొసంగితిని. ఇట్లుపరిణమించునని అనుకుంటినా? ఆకాఫరుని ఉన్నిసాదర్శించినది సోదర్బారునందేకదా?

రోష:- సోదరా! చాలును. నీయందలి ప్రేమచే పరాధీనయయి నిన్ను బాయవలెనని వచ్చినది కారణము, నవివాహితనై నీయొద్దనేయున్నందులకా నేడిట్టిమాటలు...... అగుచు, నాదురదృష్టికి నేనే దుఃఖింపవలెను__

ఔరం:- సోదరీ! క్షమింపుము. నీకింత కష్టము గలుగజేయవలెనని నేనూహింపలేదు. ఇట్టిది సంభవించెనని పరితపించుచుంటిని. ప్రతీకారము సేయలేకపోతి నేయని విచారము—

రోష:- అట్టివిచారముగలదు. ప్రతీకారము నేను చెప్పెదను. మహీ స్థానము నాజ్ఞానువర్తియై మెలగున ట్లాజ్ఞాపత్రిమిమ్ము- శివాజీని నేను సాధించెదను. మహారాష్ట్రరాజ్యమును నిర్మూలన మొనర్చెదను.

ఔగం:- నిర్మూలన మొనర్చెదవు,* నాకును విశ్వాసముగలదు. కాని ప్రయోజనము? నష్టప్రతిష్ఠ పునరార్జితమగునా- నాచతురానందఫలము మేన్మనోగర్వ నిధానము తెలుపగలవా—

రోష:- ఆఁ అదిమనచేతినుండి దాటిపోయినది. ఇప్పుడు గతములకేల బంధనమేమిటికి? కర్తవ్యమాలోచింపవలయును. శివాజీ మనవశమునుండి తప్పించుకొని పోయినాడు. అతడు మనకుశత్రువు. మనమతమును పాడుచేయ నిశ్చయించుకొనినవాడు. మనరాజ్యచక్రమును భగ్నమొనర్ప కృతనిశ్చయుడైనవాడు; ప్రబలుడై యున్నవాడు; వానివిషయమై మనమాలోచింపవలయును. అతనిని, కపటమున, గౌరవసత్కారముల నొసర్తుమని మిషచే ఢిల్లీకి రప్పించితిమి. ఖైదుచేసితిమి. దీనికాతడెంత మండిపడి యుండునో వేరుగ జెప్పవలయునా! ఇప్పుడాతడు తప్పించుకొని పోయినాడు- స్వాభిమానీకృత క్రోధావేగమున నేమిచేసినను చేయవచ్చును. మనరాజ్యము నాక్రమింప నాతడు సైన్యసన్నాహ మొనర్చుచుండవచ్చును. అతనికట్టి అవకాశము కలుగకుండ మనమేముందుగ నతనిపైకి దాడివెడలి దుర్గములగూల్చి రాజ్యమును గొల్లగొట్టి అతనిబంధించిలేదా వధించి-

ఔరం:- నాకు విశ్వాసములేదు. "అతనివలన వెంగలు సామ్రాజ్యమునకు గీడుగలుగును" అని అరచుచు నొకవిశ్వాతాకారము నాకెదుట ప్రపంచమున తిరుగుచున్నది. అతనిని సాధించుటయే వా-

రోష:- అదియే వలదనినమాట. చక్రవర్తీ! భారతసామ్రాజ్య ధారకా! మయూరసింహాసనాధీశ్వరా!

ఔరం:- ఎంతటియుత్తేజితోక్తుల సైనబల్యము. నాశరీరమునందలి స్నాయు పులకంపనా శక్తిని గోల్పోయినవి. ఆవాక్యములను వినిన నాహృదయము జలదరించుటలేదు. శరీరమునందలి అణుసంచలనము వేగతీవ్రతను దాల్పలేదు. నేనుస్తబ్ధుడనైతిని.

రోష:- హా! దుష్ప్రాప్తి-

ఔరం:- రోషనారా! ఎందులకు నన్ను ప్రోద్బలమొనర్చెదవు? నాభాగ్యచక్రము భగ్నమాయినది. చేబట్టిన ప్రతికార్యమును సఫలమగుచువచ్చిన దైవసామగ్రి అంతరించినది. ఏదిఏటులైనను గానిమ్ము. నావలన నగునదిలేదు.

రోష:- అట్లనుటకు వలనుపడదు. అశివాజీని సాధింపనిదే మహమ్మదీయులకు- వారి మతమునకు రక్షణలేదు. ఇందుకొరకైన నీవీకార్యమునకు గడంగవలెను.

ఔరం:- విధిలేక—

రోష:- అట్లైన విధిలేకనే. మహిస్థానమున కాజ్ఞాపత్రిమిమ్ము.

శారం:- రోషనారా! ఇదిగో అధికారముద్రిక తీసికొనుము. నీ యిచ్చవచ్చినట్లు నడుపుము.
(ముద్రిక పారవేయును).

రోష:- (ముద్రికను గైకొని) ఇంతటి వికలుడవు కాకూడదు. సోదరా!
(ప్రతీహారి ప్రవేశించి శారంగజేబునకొక యుత్తరమునిచ్చును).

శారం:- ఎక్కడిదీయుత్తరము. రోషనారా! ఈయుత్తరమును చదువుము. (అందిచ్చును.)

రోష:- (ఉత్తరమునందుకొని విప్పుచు) జేబున్నీసా వ్రాసినది. అది వ్రాసియుండునా!
(విప్పిచూచి) జేబున్నీసా వ్రాసినది.

శారం:- ఆ! ఏమనివ్రాసెను. ఏదీ చదువుము ఏమనివ్రాసెను.

రోష:- ఇదిగో వినుము (చదువును)
"జనకా! శుభవందనములు.

నేనొర్చినపని నీకు సంతాపకారణమేయగును. కాని నేనింతటి సాహసమొనర్చుటకుగల కారణము విన్నవించుకొనెదను.

నాకు స్వధర్మ నిర్వహణమునం దక్కుడభిమానము. హిందూజాతిస్వాతంత్ర్యము నుపాసించి నేను నేర్చుకొనిన దీధర్మము నే. హిందూధర్మశాస్త్రములయందును "స్వధర్మే నిధనం శ్రేయః" "పరధర్మో భయావహః" అనునట్టి వాక్యములేకలవు. మనుష్యధర్మము స్వధర్మ నిర్వహణము.

మనము మన ముసల్మానుమతప్రచారార్థమై శ్రమపడుచున్న విధముననే శివాజీయను హిందూరాజును ఆర్యధర్మోద్ధారణమునకై కృషిసల్పుచుండెను. అతనిని మనమునుసాధింప నెన్నియో ప్రయత్నములొనర్చి తుదకు గౌరవసత్కారముల నొసర్చి పంపుదుమనుమిషచే రప్పించితిమి. అతనిని నీవు మోసమొనర్చి బంధించితివి. అతనినిసభలో పరాభవించితివి. అది నేను సహింపజాలకపోతిని. అతనిదేశభక్తిని స్వధర్మాభిమానమును జూచి నేను ముగ్ధనైపోతిని. అతని స్వతంత్రునిగ నొనర్చితగాని నాహృదయము శాంతించునట్లు నాకు తోచలేదు. వెంటనే నేనాతని రోషనార మందిరమునుండి తప్పించితిని. సురక్షితముగ నతనిస్వస్థానమున జేర్చవచ్చుటకు స్వయముగ బయలుద్వెడలితి! ......... దుఃఖమును, సిగ్గునగుచున్నది— "జహాపనా! వీరునిసభలో నవమానింపదగునా?" అని నేనునిన్ను సమీపించినపుడు నీవాడినవాక్యములు వాడితూపులవలె నిశితములై నాయెద గాటముగ నాటుకొనినవి. అతనిని నేను మోహింపలేదు. కామింపలేదు. ఆవీరుని స్వాతంత్ర్యనిరతిని స్వధర్మనిర్వహణదీక్షను జూచి అభిమానించితిని, ఇది నా నిజస్థితి. అతని నీవు ఖైదుసేయ నేను తప్పించుటలో నేమియు దోషములేదనియే నా నిశ్చయము. నీవు నా యీ చైదమును అంగీకరించినచో తప్పక ఢిల్లీకి రాగలను.

నా పొరబాటుచే నీవు వికలుడవై ఆగ్రాకు వెడలిపోతివని వింటిని. ఎంతయు పరితపించితిని. నన్ను క్షమించి నా అభిమానమునంగీకారమే అయినచో నీవు ఢిల్లీకి రావలసినది. అదియే నీవు నన్ను క్షమించితివనుటకు చిహ్నము. అజ్ఞానమున నే నెట్టిదైన ధర్మవిరుద్ధమగు నపరాధమొనర్చిన క్షమింప ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
నీప్రియ కుమారి,
జేబునిసా.

# చతుర్థాంకము.

ద్రోణ:- ఏదీ ఆయుత్తరము...
శోవ:- బాగుగ చేయున్నది- (అందిచ్చును) ఇది సంభవమగునా—
ద్రోణ:- బాగుగనే యున్నది.
శోవ:- బాగుగ నేయున్నది—
ద్రోణ:- బాగుగ నేయున్నది, అవును- నేనొనర్చినది యకార్యమే ఈనా అకార్యమునకు నా కుమార్తె ప్రతీకార్య మొనర్చినది దానిని నేనంగీకరింపవలెను— మతమునిన నాకిచ్చి—
శోవ:- (అనూయతో) అంగీకరించుము. దుష్ప్రాపి—

(ప్రస్థానము)

ద్రోణ:- అంగీకరించెదను- శేబున్నిసా యొనర్చినప్రతీకార మంగీకరించెదను- శ్లోకపాఠము నేర్చుకొంటిని. ఈ నా జీవనచరమ సంధ్యలో నాకు విజ్ఞానోదయ మైనది. దురభిమానమేఘచ్ఛన్నమగు నా మస్తిష్కమున నొక అపూర్వ శంపాలత తళుక్కుమని మెఱసినది. స్వధర్మనిర్వహణము ప్రతివానికిని విధాయకము- అట్టి ధర్మవిస్మృతియే లేనిచో ఆజన్మ రోషమేల? శివాజీని నేనను అభిమానించెదను- నాకుమార్తె యాతని విడిపించుటలో నకార్య మేమియు నొనర్పలేదు- నేనే పొరబడితిని-• అపాపమునకు నేను దండ్యుడను- విధీ! నను దండింపుము—

(యవనిక పడును)




## రంగము 1.

స్థానము:—పురందర దుర్గసమీపారణ్యమార్గము.

సమయము - సాయంకాలము

(మోరోపంతు, అన్నాజీ ధ్వజమునుపుచ్చుకొని ప్రయాణమొనర్చుచు ప్రవేశము.)

మోరో:- ఉ॥ ఈ నగిదిన్ పురందరు జయించి మహోగ్రతపః ప్రభావసాం
దీపులు రామదాసగురుదేవులొసంగిన యీ ధ్వజంబుదు
ర్గోపరిగోపురాగ్రమున నుజ్వలమై నటియింపగా, జయ
స్తూపము నిల్పి బోవుమము జూడుము సత్కృప నో భవానిరో॥

అన్నాజీ! చూచితివా ఆ పురందర దుర్గగోపురములపై నెగురుచున్న చంద్రపతాకములను! ఈ యుద్ధానంతరమున మన భగవాజెండాయే కదా అచట నెగురవలసినది! చంద్రతారావిన్యస్తకిరీటవిశేషమును లక్ష్య పెట్టక గురవర్ణంబు కోరసిలీను మన నటియింపవలసినది! మిత్రమా! ముందుకనుచున్న మనచమూసమూహముల నావహ్వానించుట నా కాదద అనతాక చలనమును మూదించుచున్నది. అవి రణనిహతుల వీరస్వర్గమునకుం గొంపోవుదివ్యవిమానగ వైమానికంబులవలె దర్శనీయములగుచున్నవి. అన్నాజీ! అల్లదే అరియోధవాత్రిత మేఘ బాదలదిర్పియున్నదో చూడుము. ప్రబలమగు నా మొగలు పటాలమును మనమిప్పు డెదుర్కొనవలసియున్నది. మనకీయుద్ధమున జయమునుప్రసాదించునది భవానీమాతయే కదా.

అన్నాజీ:- నిక్కము. భవానీమాతయే మనకు జయమొసంగుగాక! మిత్రమా పురందర దుర్గాక్రమణమునకై యుద్ధసన్నాహములొనర్చు మనకు ఖాదుఖాదే యుద్ధప్రకటనమును పంపియున్నాడు. ఇయ్యది మనకశుభవార్తయే కదా! కాని దీనికి హేతువేమైయుండును.

మోరో:- హేతువేమైన నగుగాక మనకు భయమేల!

ఉ॥ దుర్గింపగజాలఘోరయరుల దుర్లడగింపగ లేమె సుస్థిరా
కంపిత ధీరచిత్తులముగా మెతలంపగ వేడిసీలతో

గొంపలుకాలునే గిరులుకూలునె తుమ్మిన? యుద్ధవార్త వా
రంపిన సిగ్గుసిగ్గు మనకాభయ ముత్తమవీరపాళికిన్ ॥

ఓ మహారాష్ట్రవీరుడా! గర్వింపుము. ఈ సంబోధనచే నుత్తేజితుడవుకమ్ము! భుగ్వా
జెండాకేలూని ధర్మసంగ్రామముల దృఢమాగ నిల్వుము. మన మహారాజాగారు యుద్ధ ప్రవర్త
కులైనది ఆర్యమతపము ద్ధరణార్థమయ్యేకదా.

అన్నాజీ:- (ఆ వేళమలో) ఆమాటలను— మిత్రమా! తలచికొనినపుడెల్ల నారోమడలు పులకరిలె
చుచుండును. ధర్మరక్షణార్థమయికదా తృతిప్రియునిజన్మ!—

మోరో:- అవును మహారాష్ట్రజాతియొక్క అవతారమే ధర్మనిర్వహణముకొఱకని. నా విశ్వ
సము. అట్టి విశ్వాసబలముచేతనే మనము ప్రతి యుద్ధమునను జయమును పొందగల్గుట!
అట్టిగర్వముచేతనే మన సైనికులును సంతత ప్రబలోత్సాహులైయుండుట! చూడుము
మిత్రమా! మన సైన్యసమూహము లెట్లు గంభీరగమనంబున నడచుచున్నవో

సీ॥ జవనాశ్వరింఖోగ్ర సంఘాతజాత రే
ణోత్కరంబది జలదోత్కరముగ,
చండవేదండ దంష్ట్రామరీచి ప్రతా
నంబు తటిద్వితానంబు గాగ,
యోధకదంబ మహోగ్ర వీరాలాప
తతిఘనగర్జనోత్కరముగాగ
మదకుంభిగండ సంభవదానవారి యా
ఖీలసంతత కుంభవృష్టిగాగ
గీ॥ అరిప్రతాపోగ్రవహ్ని జ్వాలార్చి వాగయు
నెగయ కుండగజేసి పూర్తిగను రూపు
మాపవెడలెను వర్షరు మహిమ బెగడి
మన మహారాష్ట్రసైన్యము మందగతిని ॥

ఆ సైనికుల యుత్సాహము దిలకించితివా! అరణభేరీ భైరవనినాదములను, సింహ
నాదములను ఖడ్గఝణత్కారములను ఎట్టి పిరికిపందకునైన నావేశంబు గలుగ జేయునుగదా.

అన్నా:- కాదామరి! మాటలసందడిలో మిత్రమా మన ముందే దుర్గమున. కతిసమీపమునకు
వచ్చియుంటిమి మన మాలోచింపవలసిన విషయములు కొన్ని గలవు. నేను
సూర్యాజీయును ప్రథమమున గొంతసైన్యముతో దుర్గప్రాకారముల భేదించెదము. ఇందు
నీసమ్మతియేమి?

మోరో:- అట్లనే అగుగాక! నేను పశ్చిమోత్తరదిశనుండి గూఢచారుల గొందరబంపి మహి
స్తానుయొక్క శిబిరమున విశేషములగనుంగొనెద. నీవ్యాసర్య కార్యమునందు భద్రము.
మహారాజావారు సర్వసైన్యములకాధింతురు. మనము భత్రపతినిగలిసికొని కర్తవ్యము
విచారింపవలయు. పత్వరముగ కమ్ము. (ఇద్దరు ప్రస్థానము.)

## రంగము 2.

స్థానము - యుద్ధభూమి.

సమయము - రెండు యామములు.

(రోషనార పురుష వేషమున ప్రవేశము.)

రోష:- దుర్గద్వారమును గాచుటకునై వేయిమంది సైనికులనుంచితిని. పశ్చిమోత్తరదిశను మహిస్త్రభాగమును నియమించితిని. నేను పద్దివేలమంది యుద్ధభటులతో రణరంగమున నురికితిని. కాని సేనాపతిని సాధింపవలెననిక దా పాదుషాయొద్దనుండి అధికారముద్రను గైకొని యీ కార్యమునకు గడంగితిని......అది యేమియోగాని నేను యుద్ధక్షేత్రమున నడుగిడి నప్పటి నుండియు నాయందొక ప్రతికూలశక్తి జనించి నన్నెన్నియోమారులు నా ప్రయత్నమునుండి మరలించుచున్నది. ఏమిది!

మ॥ ప్రతిహింసాపరమయ్యు నామనము వైరద్వేషముల్ మాని స్వ
స్థతచేనుండుట కేమి కారణము యాతండన్న మున్ వోలె కా
మతమోహమగ్నము కాదు క్షేంద మెవరో మంత్రించినట్లయ్యె నా
స్థితి నాకే భరమైన చందముకడున్ జిత్రంబుగాదో చెడున్.॥

ఆ లేఖను జూచినప్పటినుండియు నామనమిట్లయినది. ఇదిసంభవమా! శివాజీ ఉన్నీసాలకుగల ఈ అపూర్వప్రేమసంబంధము సంభవమా! సంభవమే అగునేని- ఆతలపేటికి! ఈనా మనఃపరివర్తనమునకు నా లేఖయే కారణము. అతని పొందుగోరకయే అతని ధర్మాభినిరతిని గౌరవించుచున్న ఉన్నీసాయొక్క బుద్ధివికాసమును గూర్చి ఏమనుట! "అతనిని నేను మోహింపలేదు. కామింపలేదు. ఆ వీరుని, స్వాతంత్ర్యనిరతిని, స్వధర్మనిర్వహణదీక్షను జూచి అభిమానించితిని. ఇది నా నిజస్థితి" అని తండ్రికి వ్రాసినలేఖయే ఆపెయందుగల విశాలదృష్టిని, నిష్కల్మషహృదయమును జాటుచుండెను......కాని...ఎంతవరకు సత్యమో......ఏమో ఆ తలపేటికి నాకిప్పుడు? నేనేమి సాధించుటకువచ్చితిని! ఏమిచేయుచుంటిని! (అటునిటు జూచి) ఎవరది? ఆరాధుడు—శివాజీ! ఆహా! యేమి ఆ వీరదర్శనము!

సీ॥ తరవారి కేల థళ్ థళలాడుచునుగండ్ల
మిరుమిట్లుగొలుపుచు బరగుచుండ
వామహస్తంబున వాలారుభల్లంబు
మేలిడాలీనుచు గ్రాలుచుండ
కటినున్న కాళకోకను జారి వ్రేలాడు
కైజారుసుప్రాపి కరణెబరగ
స్వాభోగ భోగిభోగాభమై బల్ తుమ్మ
సాగ శిరోపరి బరగుచుండ

గీ॥ దేవతలనైన్న గెల్చెడు ధీరుడనను
గరువము వెలికురికెనో యను రమణనవ
రుచి యొకిండావహించ వారువము నెక్కి
వచ్చు నా శివాజినిగన సంభ్రమముగలుగు॥

ఆహా ! ఏదృష్టితో జూచుచుంటినోగాని ఈ శివాజీ యన్న నాకిమో ఈవరకున లేనుండుట లేదు. ఇతనిని సాధింపవలెనని నే నిచ్చటకు వచ్చితిని. ఆ కార్యమునుండి నాకు విరక్తి జనించుచున్నది. ఏమియు దోచుటలేదు.

(ఒక భటునిప్రవేశము.)

భటుడు:- జయము జయము.

రోష:- ఓరీ ! యుద్ధము ప్రారంభమయినది పిందరి——

భటు:- మనకే జయము.

రోష: అవును. ఇప్పుడేమయినది?

భటు:- మనకు, జయముకలిగినది. మహారాష్ట్రులెల్లరు పారిపోవుచుండిరి. శివాజీ మహారాజాగారే గుఱ్ఱమునదిగి స్వయముగా తనభటులకు ప్రోత్సాహమును చేయుచు వచ్చుచున్నారు.

రోష:- సరి అంతవరకువచ్చినదా ! సేనాపతి యిపుడెచ్చటనుండెను.

భటు:- దుర్గమువద్ద హుకార్లు బిల్చుచున్నారు.

(మఱియొక భటునిప్రవేశము.)

భటు:- జయము జయము.

రోష:- ఏమిరా విశేషము?

భటు:- మహారాష్ట్రులు తిరిగి కోటగోడలపైకెక్కుచుండిరి. సేనాపతిగారు తమకు విన్నవింపుమనిరి.

రోష:- సరియే వచ్చుచుంటినని చెప్పుడు. మీరుపొండు.

(భటుల ప్రస్థానము.)

రోష:- నాహృదయము గతాగతకారిణగు యూయల వలెనున్నది. నా శరీరమందలి ప్రత్యణువులను ప్రతికూలశక్తిచేత పరివర్తనమయినట్లుండెను. నేనువచ్చినది యేలకొరకు. విధీ ! నేను నీకు వశ్యురాలను. నాచే నేమి చేయించెదవో చేయింపుము.

(ప్రస్థానము)

(ఒక వైపునుండి పాదచారియై ఖడ్గము చేతబట్టుకొని శివాజీప్రవేశము)

గీ॥ పారిపోవుడు తిరిగి నిర్భయముగాను
పోరు సల్పుడు మహారాష్ట్ర వీరులార!

ఆహవంబున మీకు సహాయముగను
వచ్చుచున్నాడు వీర శివాజి యిదిగొ ॥

ఓమహారాష్ట్ర యోధులారా! గురుదేవునిచే నొసగబడిన పరమపవిత్రమగు భగ్వా జెండా కు నపయశమ్ము రానీకుడు, కేడాధ్వజము పురందరు దుర్గగోపురములపై నెగురవలయును. ధృత ధైర్యులగండు. (మతిరొకవైపు దిరిగి) ఇదియేమి? ఓహో మొగలు సైనికులారా! విజయగర్వముచే విర్రవీగకుడు. మీరెవరికి ప్రీతిగా నిల్వబడితి రనుకొంటిరి?

సీ॥ భద్రేభయూధ కుంభముల బ్రద్దలుగాగ
గొట్టజాలుదు రొక్క గ్రుద్దుతోడ
ప్రబల దుర్గకవాట భగ్నంబొనర్తురు
తత ఘోర ముష్టిఘాతములతోడ,
శత్రువరూథినీ చయముల నూచగో
తను గోతు రొక్క యత్నంబుతోడ
ఘోరశతఘ్ని కా గోళంబులను ద్రిప్పి
విసరగల్గుదురొక్క వ్రేలితోడ.

గీ॥ భీమ విక్రమసింహులౌ యీమరాట
భటుల నెదిరింతుమనెడు గర్వంబువలదు
భయదరిపుహంతకుండు శివాజి స్వయము
గావరూధిని నడిపింప గడగె నేడు ॥

ఏమి యీకోలాహలము! ఎచ్చట జూచినను మొగలుల విజయధ్వానములే వినవచ్చుచున్నవి. మా సేనాపతులెచ్చట—

ఉ:- ఓమహారాష్ట్రులార! విజయోద్ధతి శత్రువరూథినీ భట
స్తోమములార్చెఁ దద్విమతధూర్తులఁ గాలను రాచి ఘోరర
క్తామిష పంకిలంబుగను ధారుణి జేసి పరాక్రమింపుడీ
మీమహారాష్ట్ర పౌరుషము మేయమటంచు జగాన జాటుడీ ॥

(ప్రస్థానము.)

(మతిరొక వైపునుంచి ఉన్నిసా ప్రురుషవేషమున ప్రవేశము)

ఉ:- అహా! ఎన్ని హత్యలు జరిగినవి. ఏమి ఈహాహాకారములు. ఆక్రందనములు, కర్ణవిదారణములగు రోదనధ్వనులు. ఎట్టిభీషణదృశ్యము. హా పరమేశ్వరా! మనుష్యుడు మనుష్యుని భక్షింపవలెననిసీరాజ్యమునందలి నియమమేమి! ఈదైన్యమునకు ఈహింసలకును భువినుండి అంతములేదా! మనుష్యులందరయా దాక్షిణ్యములులేక ఒకరినొకరు పొడవ

గావించుకొనుచున్నారు. మృత్యువు తమ్ము ధాయదలెననుసరించు చున్నదని యెఱుంగక యొకరినొకరు హత్యగావించు కొనుచున్నారు. దయామయా! నీవు నిశ్చలముగ చిత్రమును జూచుచుంటివా! చూడుము. నీలాకాశమును జీల్చుకొని విశ్వమునందు కలయ ఘోరముయొక్క వికట—భైరవ—విజయ—హుంకారంబులు సముత్పన్నంబులై చెలరేగుచున్నవి. ఏమి ఈభీషణ నిష్కరుణాదృశ్యము. రక్తసిక్తములై ధూళిధూసరితములైన ఆహుతక కళేబరములు నష్టాంగుల మహార్తారవంబులు—అబ్బా! నేనీదృశ్యమును చూడజాలను ......ఇంతటి వికలత్వము గూడదు. హృదయ దౌర్బల్యముచే నిట్లనుకొనుచుంటిని. యుద్ధము దైవకారణము. ఇన్ని జీవుల యాత్మబలి యొట్టిలోక కళ్యాణార్థమై యుద్దేశింపబడినదో! జీవికి మృత్యువెప్పటికైన నున్నదే. ప్రతిజీవియొక్క రక్తమున నీమరణ బీజములుగలవు! కొన్ని జీవులకీరణరూపముగు మృత్యువు విధించుటచే జీవులకును లోకమునకును నేదియేని ప్రత్యేక ప్రయోజనముండి యుండవలెను. అట్లుగానిచో ఆ దయామయుడగు జగత్పతి ఇట్టిభీషణక్రీడ కుపక్రమించునా! (ఒకప్రక్కదిరిగి) అదిగో! మరల నావైపున శివాజీ పోరుచున్నాడు. గోప్యముగనుండి సేనానన్నగాపాడు చుండవలయును. దైవము నాకనుకూలుడగును గాక!

(ప్రస్థానము)

(మరియొక ప్రక్కనుండి మోరోపంతు, భటుడు ప్రవేశము)

మోరో:- సేవకా! పోరెంత ఘోరముగ జరుగుచున్నదో. శివాజీ మహారాజుగారు స్వయముగా వచ్చి యుద్ధము సేయుటవలన మనయోధులు ద్విగుణీకృతోత్సాహులై శత్రువుల నెట్లు మట్టుబెట్టుచుండిరో చూడుము.

సీ॥ రిపుయోధ ఘోర భేరీ భైరవధ్వాన
ములు నదాటుగ విన్న నులికిపడక
సురక్త బాణాళి యెడదదూసి
పోయినబిమ్మిటి వోవకుండ
ప్రబలశాత్రవలోక రక్తపుటేళ్లలో
సేవగించుకొనక నీదికొనుచు
ఖడ్గకోటీ ఝణత్కార గభీరిమ
నేత్రాంచలంబుల నెట్టికొనుచు

గీ॥ భీమ సమరాధ్వములను, నిర్భీతులగుచు
గ్రుమ్మరిల్లెడు నాభటకోటి నెందు
శిరమునిడు నాసతోఁగాక జేరఁగలరె
ప్రతిభట నికాయమందు నెవ్వారుగాని॥

భ:- చిత్తము దేవా! ఆవైపున తానాజీగా రవిధముగా కోటగోడలపై లంఘించి యుద్ధము సల్పుచుండిరో—

మోరో:- ఈతరికి జాడము. శివాజీమహారాజు గారు శత్రువుల నీవిధముగా తమ భవానీ ఖడ్గమునకు బలినిచ్చుచుండిరో! వారొక్కరే యావచ్ఛత్రుసైన్యమును మాతమార్చు చున్నట్లున్నది. కాని, ఆవైపునుండి శత్రువులు పారిపోవు ప్రయత్నము చేయు చున్నట్లున్నవి. మనమా ప్రక్కకుంబోయి కాచియుండెదము.

(ప్రస్థానము.)

(మఱియొకవైపునుంచి శివాజీ ప్రవేశము)

శివా:- ఓయీ లగ్గలనుమాత్రము వీడకుడు. కోటగోడపైకి శత్రువులను రానీక బాణముల వదలు చుండుడు. సూర్యుడస్తాద్రి చేరకమున్నె కోటసాధింపవలయును. ఈవరకనేక యుద్ధంబుల ననేక మహాయోధుల రక్తప్రవాహములలో నభ్యంగనమాచరించి కలుగువారియున్న భవానీఖడ్గము మీకు సహాయముగ నున్నది.

గీ॥ ఈభవాని ఖడ్గంబు షహిస్తఖాను
కరము దెగగోసి యబ్జులుఖానుడొక్క
చీల్చి వ్రాని నెత్తురును బీల్చినది నేడు
తవిలి మొగలుల నెత్తురు ద్రావవచ్చె.

(ఒకవైపునుండి పురుషవేషమున రోషనారా
షహిస్తఖానులు ప్రవేశము).

షహి:- ఏమియీ బీరములు. నిద్రావస్థుడనై యున్నపుడు నామందిరమును దొంగతనముగా ప్రవేశించి అదిరయితెగి నేను గవాక్షముగుండ పారిపోవుచున్నపుడు నా చేయి తెగనరికితివి. అది ప్రజ్ఞయా! ఏదీ ఆ పద్యము—

శివా:- షహిస్తఖాన్! వినుము (ఆపద్యము తిరిగి చదువును)

షహి:- ఏదీ! ఈమొంగలుబిడ్డయొక్క కత్తి వేటునుండి తప్పించుకొనుము—(కత్తి ద్రిప్పును)

శివా:- అంతటబోదువా (కత్తి దూయును.)

రోష:- ఓయీ! మొంగలు సైన్యమునకు నేను ప్రధానసేనాపతిని. నన్ను జయించిన నీకు సంపూర్ణ విజయము చేకూరినయట్లేయగు. నాకును—

శివా:- మొగలు సేనాపతీ? నీకు యుద్ధమెందులకు. నిన్ను జూచిన నదేమియోగాని దైవము నిన్ను యుద్ధమొనర్చుటకుగాదు సృష్టించినదని తోచుచున్నది—

రోష:- ఛీ! అధీరుడవు—

శివా: కాదు. అధీరుడను కాను. నీయందు సౌకుమార్యము మూర్తీభవించియున్నది. నీవు చేయుచున్నపని నీకేయిష్టముగ లేనట్లు నీముఖభావమే తెలుపుచున్నది—

రోష:- (తనలో) ఆమాటనిజము.

శివా:- నీకు యుద్ధము వలదు.

(వెనుకనుండి షహిస్తఖాను శివాజీని దొంగతనముగా చంపబోవును)

రోష:-(రోషముతో) ఛీ! తుచ్ఛా! ఎంతటినీచకార్యము.

(ఉన్నీసా పురుషవేషముతో, నింతలో వచ్చి మహీస్తఖానుని ఖడ్గమును విరుగగొట్టును.)

శివా:- (వెనుదిరిగిచూచి ఆశ్చర్యముతో) ఏమిది. ఆశ్చర్యము—తెలిసినది. (ఉన్నీసాతో) తమ ఉపకారమునకు కృతజ్ఞుడను—

(మహీస్తఖాను పారిపోవ నుద్యమించును. ఇంతలో మోరోపంతు కొందఱుభటులతో వచ్చి మహీస్తఖానుని బంధించును. రోషనారాను పట్టుకొనబోవ శివాజీవారించును.)

మోరో:- జయము. మహారాజా! మొంగలుసైనికులు పరాజితులైరి. దుర్గము మనస్వాధీనమైనది. సేనాపతులిచ్చట నుండుటచే వారిని బంధించుటకై వచ్చియుంటిని.

శివా:- మిత్రమా! మనకు జయము కలిగినందులకు భవానీమాతకు వందనము లర్పించుచున్నాను. (మహీస్తఖానునిజూపి) ఆతనిని మీరు బంధించిరి. (రోషనారనుచూపి) ఈ సేనాపతిని మీరు బంధింపవలదు సరికదా ఏమాత్ర మగౌరవమును చేయరాదు. మహీస్తఖాను నన్ను సంహరింప బోవుచున్నపుడీతడు వానివారించెను—ఉన్నతవంశసంభూతుడు కావలె నీతడు. మఱియు మనకు విజయమెల్లనో గల్గినదికదా! మహీస్తఖానునిగూడ నగౌరవింపవలదు. (ఉన్నీసానజూపి) ఈతడు నాకు ప్రాణదాన మొసంగియున్నాడు. ఈమహాత్ముని మనము స్వజనములోని వానిగ సంభావించి మన్నింపవలయును. మోరోపంత్! నీవు దుర్గములోనికిబోయి వీరలకుయోగ్యములగు బసల నేర్పాటు జేయుము. మఱియు నష్టాంగులై యుద్ధభూమినిబడియున్న వీరుల కెల్లరకును మహారాష్ట్రులకు మహమ్మదీయులకు స్వమత విమత భేదములేకుండ చికిత్సోపచారములు జరుగు నేర్పాటుల గావింపవలసినది. అప్రమత్తుడవై యుండుము. నీకార్యములయందు—

మోరో:- ప్రభూ! తమయాదేశము నెఱవేర్చెదను! సర్వము నట్లనే జరుగును.

(పరిజనముతో మహీస్థఖానుతో ప్రస్థానము.)

శివా:- (ఉన్నిసాతో) ఆర్యా! తమరు నాకుప్రాణదాతలు. తమఋణము—

ఉన్ని:- రాజా! ఆ ప్రస్తావనేటికి? నా కర్తవ్యమునే నెరవేర్చితిని.

శివా:- ఆర్యా తరుణమున నాకుసహాయపడిరి. నాచేయు సత్కారము లందికొనకయే యేగుదురా!

ఉన్ని:- రాజా! మఱియొకమారు చెప్పుచుంటిని, నన్నిట్లు నిర్బంధపెట్టుట నీ కుచితముగాదు.

శివా:- ఇదిదోషమా! సత్కారమొనర్చుట దోషమా!

ఉన్ని:- అవును మాకిష్టము లేనపుడది దోషమేయగును.

శివా:- మఱి నన్నురక్షించుటయందలి మీయుద్దేశము.

ఉన్ని:- మా యుద్దేశమును నీకు తెలుపనవసరములేదు. అయినను నేనొక మొంగలువీరుడను. నీకువిరుద్ధముగ యుద్ధమొనర్పవచ్చిన వారిలోనివాడనే నేను. కాని అన్యాయము జరుగుచుండుట చూచి యోర్వలేక మా స్వజనుడైనను మహీస్తఖానుయొక్క దురుద్యమమును వారించితిని. యోగ్యమర్యాదననుసరించి నేనట్లుచేసితినేగాని నీచే సత్కారములనందుట కాదు. నన్ను సురక్షితముగ బోనిమ్ము. అదియే నీవు నాకుచేయు నుపకారము.

శివా:- (రోషనారను చూచుచు) అట్లనే కానిండు. మీరిద్దరును మీ మీ సేవలతో సుఖముగ బోవచ్చును. అలసియుండిరి. రెండుదినములాగి మా చేయు సత్కారములనందుడి.

రోష:- ఇదియేమి మాకేమి సత్కారములు (ఉన్నిసావైపు చూచును.)

ఉన్ని:- తమరు మాకు సత్కారము లొనర్చుటయేమిటి?

రోష:- తమరు విజేతలు. మేము పరాజితులము.

శివా:- ఆభేదము వలదు. (ఉన్నిసాతో) నాయందు దయయుంచి-

ఉన్ని:- యోధా! ఎంతచెప్పినను నీవు మానవు. మేము ఆదుర్గములో నికి రాజాలము. మాకు ఊరి బైటనే బసనేర్పాటుచేతురేని రెండుదినము లుండిపోదుము.

శివా:- ధన్యుడను. అటులైననుగానిండు. (రోషనారనుచూచి) తమరు పరాజితులైతిమని చింత వలదు. జయాపజయములు దైవాధీనములు. ఈవరకలో మీరుజయించిరి. ఇప్పుడు మేము జయించితిమి. జయించితిమనుగర్వమును మాకులేదు. నాప్రార్థనమును తమ రవ్యధా తలంపక రెండు దినము లుండిపోగలందులకై ప్రార్థించుచున్నాడను.

రోష:- శివాజీమహారాజుగారూ! తమ ఉన్నతాశయములకును ఆదరబుద్ధికిని మాకెంతయు నానంద మైనది. తమయాజ్ఞ యట్లనే నిర్వర్తింపబడును.

శివా:- ధన్యుడను. ఎవరక్కడ? అన్నాజీ

(అన్నాజీ ప్రవేశము.)

అన్నా:- ప్రభూ! ఆజ్ఞ. మోరోపంతుగారు వీరినిదోడ్కొని రానన్ను బంపిరి.

శివా:- నీవువీరిని వెంటనిడుకొనిపోయి మోరోపంతుగారితో వీరికి మనపురపరిసరోద్యానమున శిబిరముల వేయించవలసినదిగా నాయాజ్ఞయని చెప్పుము. (రోషనారా ఉన్నిసాలతో,) ఈతడు నాసేనాపతి. తమరీతనితో నేగిన వలయు నేర్పాటులన్నియు జేయగలడు. ఇంతలో ప్రార్థనాదికములు నిర్వర్తించుకొని తమ సన్నిధికి వత్తును.

ఉన్ని } రోష }:- అట్లనే కానిమ్ము (అన్నాజీతో ప్రస్థానము.)

శివా:-ఆహా! ఈ మొగలుల యందెంతటి ఉత్తమప్రకృతిగలవారు కలరు. స్వపక్షమువాడనిరైన శంకింపక షహిస్తఖాను నన్ను సంహరింపజూచుట అన్యాయమని యెఱిగి అదివారించిన ఆ మొగలు యోధుని నేమని పొగడవలయును. ఒకసామాన్యభటునికే యంతటి మర్యాద విచారణమా! ఇట్టివారి నీయుద్ధమున నెందఱిని మారమార్చితినోగదా! ......నాకు విజయము గల్గినది కాని

ఉ॥ ఎంతటి రక్తపాతమున నీవిజయోందిర నాకుగల్గె దు
ర్దాంత దురంతదుర్వహ పరాభవదుఃఖముకన్న ఘోరమౌ
వంతజనించె మోదములవంబునుగల్గదు నాకు గానుకా
లాంతక భీమ యోధచయు మారణభూమి నసించి యుంటచే॥

ఎంతటి రక్తపాతమున నాకీవిజయము కల్గినది. ఈయుద్ధార్ణవము నీదుటకు నెందఱి యోధుల జీవోడము పంటలు కావలసివచ్చినవి. క్షాత్రధర్మ ఫలితమాయిది! ఎంతటి దుర్భరంబుగనున్న దియీ క్షాత్రనైచ్యము. క్షాత్రము నీచము గాదా?

గీ॥ విశ్వమానవభ్రాతృత విడపుచ్చి
నెత్తురుం ద్రావు క్షాత్రము నీచమౌని
కృష్టమో క్షాత్ర పైశాచ్య మిట్టిదంచు
ధరణిజాలెడు రక్తస్రోతస్సులవిగో !

ఎందఱి సుభగుల రుధిర మీ రక్తప్రవాహమున మిళితమైయున్నదో! ఈయుద్ధక్షేత్రమున నీవాతావరణమున నెందఱి రణనిహతుల యాత్మలు నిండియున్నవో.......తల్లీ! భవానీ!

చ॥ అరయ స్వధర్మ రక్షణకు నైదమ నెత్తురునోడ్చి ఘోరసం
గరమున గూలినట్టిగుణగణ్యుల యాత్మలు శాంతిబొంది సు
స్థిరమగు స్వర్గసౌఖ్యముల జెందెడునట్టులనుగ్రహింప నే
గరము లమోడ్చి మ్రొక్కెదను గావగదమ్మ భవానిమాతరో ॥

(ప్రస్థానము.)

ఆవృత్తి రంగము-

స్థానము:— పురందరు దుర్గపరిసరోద్యానము.

సమయము — సాయంతనము.

( ఒక పూరుషచ్ఛాయను జేబున్నీసా నిలుచునియుండును. )

జేబు:- (స్వగతము) అతడు కృతకృత్యుడయినాడు. నాకు మన శ్శాంతి కలిగెను. నా హృదయ దౌర్బల్యమున నేనొకటి యిచ్ఛయించితిని. ప్రమాదమునుండి యుద్ధరింప బడితిని...... కాని, ఛత్రపతీ! నీకీరహస్య మేమియును తెలియదుకదా! నేను నిన్ను ప్రేమించుచున్న మాటవసరైనను గలుగ లేదు కదా! నా ప్రేమ జగత్తువంతయును నా హృదయమునందే దాచియుంచితిని. నా ప్రేమాతిశయమును, సౌందర్యాతిరేకమును, నీకు వెల్లడిచేసియుండిన యెడల నీవు తప్పక నన్ను వివాహమాడి యుండెడివాడవని భయపడితిని భయ మెందుల కందువా! నీవు నామతసుడవు కానికాదు... విధర్మివని కాదు. నేను నిన్ను మోహపాశములచే బంధించి నీ స్వధర్మ దీక్షకు కళంకము గల్పింతునేమో యని భయపడితిని. మఱియు, నేను నిన్ను ప్రేమించుచుంటినని నాతండ్రి యెఱిగిన నాతడు నీకట్టియపాయము సేయునో యని శంకించితిని. ఇంతియే కాదు. నేను నిన్ను ప్రేమించుచుంటినని నీకు దెలిసిన నీవు నీహిందూధర్మమును — స్వధర్మమును వదలివేసి నామోహపాశములో జిక్కుకొని పాదుషాకు బాదా క్రాంతుడవైన గావచ్చును. నీవు నన్ను వివాహమాడి యొకవేళ ఔరంగజేబునకు నల్లుడవై యతనికింద ముఖ్యసేనానాయకుడవో ప్రధానమంత్రివో కావచ్చును. నాకీరెండు సందర్భములు ఇష్టములేదు. ఈ జేబున్నీసా ప్రేమించినది శివాజియొక్క శరీరమును కాదు. తెలివి తేటలను కాదు. ఆ.. హిందుధర్మమునకు దనసర్వస్వము నర్పించిన వీరుని— మతస్వాతంత్ర్యమునకై పతాకధరుడైన దేశభక్తాగ్రేసరుని నేను ప్రేమించినది, శివాజీ! ఎపుడు నీవు నీకర్తవ్యమును వదలి పరరాజ్యముక్రింద నౌకరీకి యొప్పుకొనెదవో అది మహాభాగ్యవంతమైనదే యగుగాక కేవలము ప్రధానమంత్రి పదవియే సిద్ధించును గాక! ఏమైననేమి అప్పుడు నీలో సౌందర్యమెక్కడ — శౌర్యమెక్కడ — ధర్మమెక్కడ — దేశభక్తి యెక్కడ- గోరక్షణమెక్కడ — అట్టి నిన్ను నేను ప్రేమించియుండను...... నీవు ఢిల్లీపాదుషాకు ఆర్యధర్మము పేరట, గోమాత పేరిట, బ్రాహ్మణవర్గము పేరిట వైరివై, వీరుడవై, స్వతంత్రుడవై, స్వదేశాభిమానివై నిలువబడితివో ఆ మహారాష్ట్రఛత్రపతివి ఆజాతియోద్ధారకుడవు—అశివాజీవి నీవు నా అభిమానాస్పదుడవు ... కావుననే నా ప్రేమమర్మమును వెల్లడిసేయక నిన్ను మాత్రము గాపాడినాను. నా మనోరథమును నా హృదయమునందే లయింపజేసుకొంటిని....నా అంత్యకామనము నీకు జయమగుగాక! నీవు నా ఆరాధ్యదేవుడవగుదువుగాక నా జీవితమునకు కృతార్థవగుదువుగాక! నీయొక్క జీవనపావిత్ర్యమే స్వధర్మ నిర్వహణాభిరతియే! నాకు నిత్యానందమును గూర్చుగాక! ... ఈ పుష్పమిట్లు వాడిపోవలసియున్నను ఛత్రపతీ! అది యిట్లగుగాక! మన ప్రేమసంబంధమజ్ఞాతమే యగును గాక! సూర్యరశ్మి

యొక్క సువర్ణసూత్రములచే ప్రేమమాలికల మనమనోజ్ఞత్వ మలంకరించుచుందము. అవు
ను. నీవుసూర్యుడవు... నేను కమలమును... నీవుఘనుడవు... నేనుచాతకమును... నీవు చం
ద్రుడవు... నేనుకల్వను.... ఇట్టిదే మనసంబంధము. నీవురాజువు. నేను నీకువలయును
(అటు నిటు జూచి) సేనాపతి యిటువచ్చుచున్నాడు, ఈతడు సర్వదా నన్ను వెంటాడు
చుండును. కారణమనూహ్యము. నన్గుర్తించెనా... అదుగో ఇటే వచ్చుచున్నాడు...
నేను మఱియొక ఉపవనమున కరిగెద గాక!

(ప్రస్థానము)

(రోషనార ప్రవేశము.)

రోష:- మ॥ అరరే యెట్టిమహోన్నతాశయములా హా సాధ్వి జేబున్నిసా
చరితంబింతటినిష్కళంకమె! దురాశాభూత దుష్కామభో
గరతింగోరి యధోగతింబడిన నా కర్మంబు నేమందు నే
సరణిం బాప విముక్తినొందుదునో పశ్చాత్తాప మొండేకదా!

పశ్చాత్తాపమే పాపతరణోపాయము. పశ్చాత్తాపమునందును సుఖము గలదు. ముక్తిగలదు.
ఆహా! మా ఉన్నిసాజీవిత మెంతటినిష్కళంకము! లోకమున నిట్టిదిసంభవము అనిమొద
టనే ననుమానించితిని. నా జనకుడు తనది అకార్యమని అంగీకరించినపుడు నే వనూయ
పడితిని. ఏమి అనిష్కళంకమగు ప్రేమ. ఆహా! ఉన్నిసా! నీ జీవితము నా కాదర్శమయి
నది సుమా! నాకే కాదు నీ చరిత్రము శివాజీకి తెలియదు గాని, తెలిసినచో నాతడును
నీజీవితము నాదర్శముగ గ్రహించును. అతడు తన మతమునకై నిజసర్వస్వము నర్పిం
చెను. లోకమున తన ఆర్యధర్మమునకు ప్రతినిధియై నిలచెను. కాని ఈ విశాలప్రపంచ
మందెందైన నిట్టిది కలదా! అన్యమతసంరక్షణకై అకు కత్తిదూసినది మా ఉన్నిసా! ఎంతటి
ఉదారహృదయ! మనుష్యత్వము యొక్క ఆదర్శము - జీవపరిణామసిద్ధి- ఇట్టి సర్వమత
సామరస్యమునందే యున్నదని నేనిప్పటికి దెలిసుకుంటిని. ఈ సంగ్రామమున బ్రవర్తించు
టచే నా జన్మధన్యమైనది. ఈ శివాజిని మొదట నే నశ్మధాగ్రహించితిని. కాని

శా॥ ఈ యనఘాత్ముడింతటి యుహీన ప్రఖ్యావిభవుండు ధర్మ ర
క్షాయతనుండునౌనె శుభకాముడునౌనె శివాజియున్న నే।
మో యనుకుంటి నెంతటిమహోన్నత దివ్యగుణప్రశోభితుం
డీయనఘుండువీనినిజితేంద్రియుడంచు నెఱుంగనైతి హా!

యిన నా కీప్రమాదము శుభదాయకమే అయిన కారణమున నేను ధన్యురాలనే. ఈశ్వ
రుడు నా జీవితము నీవిధముగ శిక్షించుట ... లోకహితమునకరించికావలయు. నా జీవి
తముయొక్క ఈ శుభపరివర్తనమునకు ఉన్నిసాయే గదా కారణరాలు. ఈమెకు నా కృత
జ్ఞతను దెలుపుటెట్లు? నేను తనను గుర్తింతునేమోయను భయమున నాబోలు ఈ దినముం
తయు నన్నుతప్పించుకొని తిరుగుచుండెను. నన్ను గ్రహించిరుండునా! నీవు నాసైన్యము

లోని కెప్పుడు వచ్చితివి, క్రొత్తయోధునివలెనుంటివని నేనవ[illegible]ను క్రొత్తసేనాపా యకులవలె నుండిరేయని ప్రత్యుత్తరమిచ్చినది. ఇది నన్ను గ్రహి[illegible] యనినమాటయగునా.

(ఉన్నిసా ప్రథమ సఖి భటుని వేషమున ప్రవేశము)

భటు:- వందనములు. పాదుషాగారి ఆజ్ఞాపత్రము —

(అందిచ్చును.)

రోష:- ఏమి ఆజ్ఞాపత్రము? నీ వెవరవు?
భటు:- రోషనార బేగం—
రోష:- (ఆశ్చర్య చమత్కృత యగును.)
భటు:- నే నున్నిసా బేగంగారి సఖిని.
రోష:- నీవు నన్నెట్లు గుర్తించితివి. ఈ ఆజ్ఞాపత్ర మేమి!
భటు:- తమరిచ్చటనుండిరని గుడారములవద్ద మహిస్తఖానుగారు చెప్పిరి. ఈ ఆజ్ఞాపత్రము పాదుషాగారు తమకును, సేనాపతులకును వ్రాసినది. హిందువులకుగాని, వారి మతమునకుగాని ఎట్టి అవమానమును గలుగ జేయరాదని. శివాజీగారితో యుద్ధము మాని వెంటనే ఢిల్లీకి మరలిరావలసినదనియు వారి ఆజ్ఞ.

రోష:- మాకీ ఆజ్ఞ యీనాటికేవచ్చినది. పాదుషా యిప్పుడెచటనున్నాడు?
భటు:- ఢిల్లీకి తిరిగి వచ్చినారు.
రోష:- (దూరమున దృష్టి నిగుడ్చి) అదిగో మా ఉన్నిసా బేగమే ఇటువచ్చుచున్నది. ఇందెందైన దాగియుండి ఆమె చర్యల బరిశీలించెదము గాక!
భటు:- ఏమి ఆవచ్చునది నా సఖి ఉన్నిసాయా! ఆమెనున గుర్తించనే లేకపోతిని—
రోష:- నీవు సంభ్రమమును పొందకుము. సర్వము శాంతచిత్తమున గ్రహింతువుగాని. రమ్మిట దాగికొందము.

(ఇర్వురు నొకలతాగృహమున దాగికొందురు.)

(ఉన్నిసా ప్రవేశము)

ఉన్ని:- గీ॥ విమలమందార సుమ మరందములవీడి
కంటక నిరుద్ధ కేతకీకాంత్తుబోవు
భ్రమరముంబోలె ప్రేమప్రవాహగర్భ
వీచికా కేళిబాసి దుర్విషపరీత
కూపవాసంబు లోభమా కోరదేల!

ఇప్పటికి నాకు ఒకించుక మనశ్శాంతి కలిగినది. కాదు. కాదు......నాహృదయము సుఖస్వప్నములతో నిండిపోయినది. తుమ్మెదలు కలదిమ్మ పెట్టునట్లు పాడుచు తిరుగుచున్నవి. పక్షులు విలాసముగా కొమ్మమందు యమున విహరించుచున్నవి. మంచా

నీలంబులు నలంగ[illegible]ల కమ్మని నేత్రాల బదజల్లుచున్నవి. ప్రకృతియొక్క సౌందర్య లహరి ప్రతిని[illegible] వినూత్న శోభాపరంపరల ప్రవహించుచున్నది. కాని నా యాత్మ కానంతమును గూర్చి నన్ను సుఖినిసేయు వస్తువు దీనియందు లేదే. ఈ ప్రపంచమున నెన్ని వస్తువులు వచ్చుచున్నవి. పోవుచున్నవి. తిరిగి వచ్చుచున్నవి. తిరిగిపోవుచున్నవి. ఈజగద్వ్యాపారమే యిదికదా! కాని మనస్సులో నేదిపోయినదో · అదిపోయినది-తుడిచిపెట్టుకొని పోయినది. ఈజన్మకు తిరిగిరాదు. ఏకాలమునకురాదు ... ఆతారకలుజ్యోతిర్మండలములే కాని యవి యీ విశాలగగన భాగమున మృత్తికాపిండములవలె నున్నవి. అవి ఆ అనావిష్కృత—అపరిజ్ఞాత— అమావాస్య-నిర్వాణలోకమునుండి పావిత్ర్యమును శోభను భూమండలికి దీసుకునివచ్చు సందేశవహములని తోచుటలేదు. కోకిలకుహూయని కూయుచున్నది. నాకంటికది కాకివలెనున్నది. అదియొక వ్యర్థరూపమని బోధపడుటలేదు. వననికుంజమున మనోహరంబుగ ప్రకాశించుచు నొక ప్రసూనము వికసించినది. అది స్వాజీవితవసంతమునందలి ప్రథమపుష్పము. ఇంక నెన్నికుసుమములో సంఫుల్లములగునని యాసపడితిని. కాని నీహారపాతమున కాపుష్పపత్రములు తునిగి రాలిపోయినవి ... ... ఆశాలత తెగిపోయినది. దుఃఖతరంగములు నాహృదయముపై గొట్టుచున్నవి. ఏమిచేయుదు? నా భవితవ్యము నూహించిన నాకు అగమ్యగోచరముగ నున్నది నేను వాని విషయము విచారించుట మానినను......అతని వియోగమును సహింపలేకున్నానేమి?......అకటా! నేనీనరజన్మ మెందుల కెత్తితిని? నీవుమాత్రము—శివాజీ! వంటికాన్పు నేలకావలెను. మనమిద్దర మీనిర్జరారామమున నీసరోవర తీరమందలి నీవొక వృక్షము నేనొక లతను ఎందుకు కాలేదు? నిన్నుపుష్పములతో గప్పివైచియుందునుగదా! ఆకులాకులు రాచుకొనుచు నీనిర్జనస్థానమందు సంతోషవార్ధి దేలుచుండెడివారముకదా! ......అబ్బా! ఈకలకంఠటి పుణ్యమా!— ఎదుట "సచ్ఛైలీ!" అని దైవప్రేరితుడై నన్ను సంబోధించినపుడు నిరాకరించి పారిపోయివచ్చిన నాకంతటి పుణ్యమా? మిత్రుని సంబోధించుట కన్ని పేరులు లేవు. సచ్ఛైలీయని సంబోధించుట నాభాగ్యమే......ఇదియా ఫలము! ఎందఱీసంసారమునకు వచ్చుచుండిరి పోవుచుండిరి. ఇహసుఖంబుల బొంది తరించుచుండిరి. కాని ఈజేబున్నిసామాత్రము శాల్మలీపుష్పమువలె నిట్టువాడి రాలిపోవలసినదే...... అబ్బా! నా జీవితములో "సచ్ఛైలీ"యని యనిపించుకొంటిని. ఒక మహాపురుషునిచేత ననిపించుకుంటిని: అదిచాలదా! వేయికాలములు సుఖముగ సంసారమొనర్చుటకు. అదిచాలదా! ...అయ్యో! ఈనా పిచ్చియేమి! ఏమి చూచికొని నా యీయూరట! తుచ్ఛములగు నైహికేచ్ఛల గోరజాలనుగదా! ఆధర్మమూర్తి ఇపుడు సురక్షితముగనున్నవాడు. ఇక నేను......అతని రక్షింపగలిగితినని సంతసించుచు మనగలభాగ్యము లేదుకదా! గృహమును విడిచివచ్చితిని. జనకునధిక్కరించితిని. సఖులబాసితి. పోనిమ్ము తిరిగి ఢిల్లీకి మాత్ర మేముఖము పెట్టుకుని పోదును. జనకుడు క్షమించునా! సఖులు కలసివర్తింతురా! నేను శాశ్వత బ్రహ్మచర్యమునవలంబించు నన్ను లోకమంగీకరించునా! ......నిజమున కిలోకమున స్థానము లేదు. సంసారము యంత్రాగారమైనది. అది సుఖనికేతనమని స్ఫురించుటలేదు ... ఏమిచేయుదు? ఏమి దారి? మరణమే నాకిక శరణ్యము. అవును. నాకు మరణమే యోగ్యము...నావంటి పాపాత్ము

రాలికిమరణమే తగినది. హృదయ దౌర్బల్యముచేనే నా ధర్మమూర్తిని పరిణయమాడ నొకప్పుడు సంకల్పించితిని. ఆపాపమునకు ప్రాయశ్చిత్తము చేసుకొనెదగాక (బొడ్డులోనుండి ఖడ్గమునదీసి) దీని సాధర్మసాధకుని యొద్దనుండి బహుమానరూపమున గ్రహించితిని. నేటి కిందుల కుపయుక్తమగుచున్నది.

గీ॥ స్వమత నిర్వహణైక దీక్షాపరుండు
కరుణ నొసగిన ఓకృపాణ ఖడ్గమా! స్వ
ధర్మధిక్కార మొనరింప దలచినట్టి
కలుషమతినైన నాప్రాణములనుగొనుము ॥

(పొడుచుకొనబోవును- ఇంతలో వెనుకనుండి రోషనారయు, సఖియు వచ్చి రోషనార పుష్పహారమును మెడలో వేయును సఖి ఉన్నిసాను వారించి కత్తి పారవేసిపట్టుకొనును.)

సఖి :- సఖీ! ఇంతటిసాహసము కూడదు. గుర్తింపలేదా! నేను నీసఖిని—

రోష:- ఉన్నిసా! అధీనవుగాకుము. గుర్తింపలేదా! నేను రోషనారను.

సఖి:- సఖీ! నీయుత్తరముచూచి నీజనకు డెంతయుచింతిలెను సుమా! నీవు వత్తువనుకొని వెంటనే ఢిల్లీకి వచ్చినాడు.

ఉన్నిసా :- అంతటిభాగ్యమా! చెలీ! నాజనకుడునన్ను క్షమించెనా. నాచయిదము నంగీకరించెనా?

సఖి :- అంగీకరించుటయేకాదు. తానును సత్యమునుగుర్తించినాడు. సేనాపతుల కెల్లరకు నొకఫర్మానా వ్రాసిపంపినాడు.

ఉన్ని:- ఏమని—

రోష:- ఆఫర్మానా ఇదెచూడుమా!

ఉన్ని:- (చేకొని చదువును.)

"నా శాసనమున నుండు ప్రతి సేనానికిని దుర్గాధిపతులకును నా యొసగునాజ్ఞ...
మీవశమునగాని, అధికారమునగాని యుండు ఏహిందువునకునుగాని, వాని మతాచారములకుగాని వాని దేవాలయములకుగాని అవమానము కలుగజేయరాదు. మనమతప్రచారము నకై వారిమతము నణగద్రొక్కరాదు. భయపెట్టిగాని ఆశజూపిగాని హిందువుల మహమ్మదీయులలో గలుపుకొనరాదు. ప్రత్యేక కారణముతేనిదే హిందువుల దుర్గముల నాక్రమింపను రాదు.
అజ్ఞోల్లంఘన మొనర్చువారు ఘోరదండనప్రాలగుదురు."

బాదుషా ముద్రియున్నది.

సఖీ! నాజనకుడింత యోగ్యుడగుట నేనెంతయు ధన్యురాలను సుమా!—

సఖి:- నీజనకుడు నీకొఱకై చాల బెంగపెట్టుకొనినాడు. నిన్నెట్టులేని ప్రార్థించియైన ఢిల్లీకి తీసుకునిరావలసినదని యెన్నియో విధముల నన్ను బ్రతిమాలెను.

రోష:- ఉన్నిసా! మనము శివాజీకి తెలియకుండగనె వెడలిపోవలయును. ఉదయముననే మనల పరామర్శించుటకు స్వయముగ రెండు పర్యాయములిట కేతెంచి యున్నాడు. [illegible] ఎంతటి కరుణాళుడో!

ఉన్ని:- (రోషనారతో) అత్తయ్యగారు! అతనంతటి కరుణాళుడే యగును. కాని నన్ను మీరు క్షమింపవలెను. తెలియక నేజేసిన దోషములకు మన్నింపవలెను.

(నమస్కరించును)

రోష:- (లేవనెత్తి) అయ్యో! పిచ్చిదానా! నిన్ను నేను క్షమింపవలెనా! నీవే నన్ను క్షమింపవలసియున్నది. స్పర్థవహించి నిన్ను సాధింపవలెనని వచ్చి నీచే నేనే సాధింపబడితిని—

సఖి:- (దూరమున దృష్టినిగుడ్చి) ఆ వచ్చునది ఎవరు?

రోష:- అదిగో శివాజీ యిటువచ్చుచున్నాడు. మక్కెకొఅకే యైయుండును. ఉన్నిసా! మనము శివాజీని ఆశీర్వదించి అతనికి మనమని తెలియకుండగ నెఢిల్లీకి వెడలిపోవలయును.

ఉన్ని:- అదియెట్లు సాధ్యమగును.

రోష:- మనము యోగినుల వేషము వేసుకుని అతడీ ఉద్యానమున నుండగనే వచ్చి జయగీతమును పాడిపోగుదము. మనకునై అనతిదూరముననే అశ్వముల సుసజ్జితములుగ నొనర్చియుండు నేర్పాటు చేతును. మన సైనికులను మహీస్తఖానుని అధికారమున అచిరకాలముననే మనలనువచ్చి మార్గమధ్యమున గలసికొనగలరు.

ఉన్ని:- సఖీ! రమ్ము—

సఖి:- మీరిద్దరేగిరండు. నేనందేయుండి అతని పరిశీలించుచుండెదను.

ఉన్ని:- వానికంట బడకూడదు సుమా!

ఉన్ని:- }
రోష:- } (ప్రస్థానము)

సఖి:- ఈ శివాజీ! ఎంతటి యద్భుత చరిత్రుడు. వీని మహిమ వర్ణనాతీతమువలె నున్నది. నేనీలతాగృహమునుండి వీని చర్యల పరీక్షించెదగాక.

(దాగును)

(ప్రవేశము శివాజీ)

శివా:- శా॥ మాయాతీత పురాణవస్తువనిసంభావించుచేకాని యే
మాయాసత్యమెవం డెఱుంగుమును లేయూహింపగాలేక యో
గాయాసంబును జెందుచుండిరన నౌరా! మానుశక్యంబె? దే
వా! యీ వే కరుణించి తెల్పవలె మాయాతత్వ మీ జీవికిన్॥

గీ॥ ఈజగద్రంగమందు నీవెన్ని పాత్ర
ముల ధరింతువో అభినయంబును నొనర్తు
చోద్యమగు జగన్నాటక సూత్రధారి
వఖిల లోకేశ! నీలీల లద్భుతములు॥

యిచ్చెను. ఆహా! ఇక్కెచ్చటనైనఁగలదా! మహమ్మదీయులకు దృష్టాంతములుండునా? అయ్యో! అప్పుడే నాకీవిచారమేల కలుగకపోయినది.......జేష్టాదారు తప్పక స్త్రీయే కావలెను. ...కాని...ఏమో ఉండకూడదా? ఏమో! ఏది సత్యమో ఆ కేసుజాదారో స్త్రీయగునో పురుషుఁడగునో—

(స్థలాంతరమునుండి ఉన్నిసాసఖి "స్త్రీయగు" ననును)

(ఆశ్చర్య చమత్కృతుఁడై ఇటునటుఁజూచి) ఈశబ్దమెందుండివచ్చె... ఇచట నెవరైనఁగలరా? (కలయవెదకి ఎవరినిగానక కాదు ఇది సాధ్యము, ఆశబ్దమంతర్వాణిద్వారా యుండవచ్చును ఆకే మజాదారు నిశ్చయముగ స్త్రీయే కావలెను. అగునో నన్ను రక్షించుటయందలి యుద్దేశము.—

(స్థలాంతరమునుండి ఉన్నిసాసఖి "నీ స్వధర్మనిర్వహణ దీక్ష" అనును.)

(ఆతురతతో జూచుచు) ఏమిది స్వప్నముగ మనుష్య వాక్యములువలె నున్నవి. (కలయ వెదకి ఏమియుగానక) నాకు మనోవైకల్యముకలిగినది. అందుచే నిట్లుభ్రమించుచుంటిని.., ఆహా మాటల తిరుగుచున్నది... నాకేమియుదోచుటలేదు... నన్నిన్నిమారులు సంరక్షించినది పాదుషా అంతఃపురమునందలి ఒక మెంగలు స్త్రీయట! అట్లునన్ను రక్షించుటకు గారణము నా స్వధర్మనిర్వహణదీక్షను ఆమోదించిన అభిమానమట! ఆహా! ఎంతటి యుత్తమోత్తమపరిష్కృతి! నా స్వధర్మనిర్వహణదీక్షనుమించినదే ఇది. ఒక జాతికొఱకై ఒక దేశముకొఱకై నిలచిన ఈ సాధారణమనుష్యకీటకము నభిమానించుకొనిన ఓ పుణ్య సాధ్వీమణీ!

మ॥ అని హిందూమత ధర్మనిర్వహణ మేనర్థించిగావించి నా
డను నన్నున్ మఱి నామతాశయమ్ము వేడ్కన్ గావఁగాఁగత్తిదూ
సిన నీ యోగ్యత నీ స్వభావము పరశ్రేయోభిలాషంబు నెం
తనీవర్ణింతును నీయనూహ్యమగు మాయాజీవితాదర్శమున్ ॥

ఓ పుణ్యసాధ్వీ! నేనొకపాఠమును నీ చరిత్రమునుండి నేర్చుకుంటిని. నేను నా ఒక్క మతముకొఱకుగాను ఖడ్గధరుఁడనై క్షాత్రమునిర్వహించుచు స్వమతరక్షణమునే ఆదర్శముగ గ్రహించియుండ అట్లుకాదు లోకమునందలి సర్వమతములకొఱకును, ఎల్లరి విశ్వాసములకొఱకును నగు శ్రేయోనిర్వహణమే యోగ్యాదర్శముగునని నీవు నేడు లోకమునకు జాటియున్నావు. అది నేను గ్రహించితిని......... ఆహా! నా వైరివర్గమునకు జెందియు ఇంతటి పరమోత్తమమగు శుభచింతనమా! ఇట్టి సాధ్విని నేనేమని సన్మానింతుఁ! అవును.

మ॥ ఇది సత్యంబగునేని ఆ యతివ యిట్లే స్వచ్ఛసద్భావ సం
పదవర్తించిన మాఅరుంధతి సతీమైత్రేయి గార్గి మహా
విదుషీలోకము తోడనీడయి నభోవీథిన్ వెలుంగొందునో
క్కదిశన్ గీర్తిమరీచి నింపిధ్రువనక్షత్రాభమై నిత్యమై ॥

అపరిచితవగునో కరుణాస్వరూపిణీ! తస్మాత్సర్వదింపుము. సర్వమత సంరక్షణాదక్షత చే నన్ననుగ్రహింపుము. అసహిష్ణుతనుండి నాదేశము నుద్ధరింపుము. నాకీ వరమొసంగుము.

సీ॥ "సత్యమేవజయతే" "సత్యంవద"యటంచు
  వర్తిలివర్ధిల్లు ప్రజలుగలుగ
సర్వభూతంబుల సమత నారసి లోక
  హితముగావించెడు మతముగలుగ
ధర్మ సంస్థాపనార్థము జీవనముసేయు
  పరమ పుణ్యాశ్రమ ప్రతతిగలుగ
జగదనుకూల ప్రశస్తభుక్తిదములై
  ఘనములౌసత్యమార్గములుగలుగ
గీ॥ జాతిభేదాది బుద్ధి సంజనితపాప
  తిమిరభంజన సంవిదర్యమ మరీచి
  వీచికా శ్రీపునీత సద్విద్యగలిగి
  దివ్యమైమించుగాత మా దేశమాత॥

(తెరలో "తథాస్తు")

అదిగో స్వర్గదేవతలు "తథాస్తు" అనుచుండిరి. ఓభారత సంతానులారా! అపూర్వవ్యక్తులు మీదేశమునగలవు. అది మీరెఱుగరు సకల జగన్మాతైక్యతకుమంగళ మూర్తియగు నొక సాధ్వియొక్క పవిత్రతత్వమును మీరెఱుగరు. నిష్కళంకమగు ఆ పవిత్రతత్వము భారతవర్షమున సర్వలోకముఖ్యమగు నంతస్స్రోతస్సుగ హస్తినాపుర ప్రాంతమునుండి మనవైపు ప్రవహించుచున్నది.

మ॥ అదియే ప్రేమమహాతరంగిణి త్రిలోకైక ప్రపూజ్యంబు భ
  క్తిదయా ధర్మతరంగజృంభితము; విజ్ఞేయంబునున్ సత్యశాం
  త దరీభాసుర మార్యశుట్టమటనే "ధన్యోస్మి" "ధన్యోస్మి" పు
  ణ్యాద ముక్తిప్రదయంచుఁదద్ఘన ధునీస్నానంబు గావింపరే॥

ఈ మనదేశము నేడు స్వర్గమువలె నున్నది. మనజన్మభూమి స్వర్గము. దేవతా విహార సౌభాగ్యము.

సీ॥ వేద దేవతలార! వేంచేయరే మీకు
  గానాదియార్యధానియిద్ది
అఖిలకళా కాంతలార! రారేమీకు
  సంతసమిడు నాట్యశాలయిద్ది

జే బు న్ని సా

సర్వజగన్నుత సారస్వతములార
కూడిరా ర మ్మమీకూటమిద్ది
ధర్మదేవతలార ! దయసేయరే మీకు
దివ్యమా కళ్యాణతీర్థమిద్ది

గీ॥ సర్వలోకైక పూజ్య ప్రశస్తకీర్తి
దాయకములైన ఆర్యవిద్యలను గొనుచు
తరలిరారయ్య దైవ తోత్తంసులార !
స్వాగితంబిచ్చె నేడు మాజన్మభూమి

(అన్ని సారోహనారలు యోగినీవేషముల
చేరి యొకవైపునుండియు ప్రవేశము)

కృని పాడుదురు.

గేయము.

జయ జయ జయ జయ భరతమహాశయ
సఫలోదయ. ధన్య శివాజీ ॥

ధీరా జయువిజయో స్తుమహాత్మా
అన్యయోధ గజరాజ మృగేంద్రా
ఆత్మసమర్పణ చణ ఘన
ధర్మజ్ఞాన పథోద్ధామీ ॥ జయ ॥

స్వాతంత్ర్యామృత దానవలాహక
సహ్యనశక్తి యుతభటాగ్రనాధా
లబ్ధజయధ్వజ కాంతిమాలికా
తోరణ శ్రీదుర్గా ॥ జయ ॥

సాక్షాద్ధన శుభ తారక మంత్రం
త్య పూర్ణఫలదం తవనామం
సర్వలోక కళ్యాణమహీాల
క్షీవిత సంకల్పం ॥ జయ॥

4. ధర్మజీవన' పరశుక యోగీ
భీష్మశౌర్య దృఢభీమ ప్రతిజ్ఞా
అత్రి ద్వారాబహిర్వినిర్గత
శాంతమహాశ్రీమూర్తీ ॥
జయ జయ జయ జయ భరతమహాశయ
సఫలోదయ ధన్యశివాజీ

శోవ:- శోభనారా ఆశీర్వాదములు (ధీవాలున నిష్క్రమించును) } ఉన్ని సా:- జై — (చివాలున నిష్క్రమించును

(శివాజీ నిశ్చేష్టుడై యుండును)

యవనిక పడును.

సంపూర్ణము.

